"నరుడా ఏమి నీ కోరిక" లో అక్కినేని.



# ప్రవేశ పెడుతున్నారు

# క్రొత్త గ్లూకోవిటా లెమన్

## ఒకే ఒక్క ఫ్లేవర్డ్ గ్లూకోజ్

ఇప్పుడు, మీకు ఇష్టమైన గ్లూకోజ్, నిమ్మకాయ రుచితో లభిస్తోంది. ఇది విటమిన్ డి 3 మరియు కాల్షియమ్ ఫాస్ఫేట్లతో మరింత బలపరచ బడుతోంది. క్రొత్త గ్లూకోవిటా లెమన్, మీ అలసటను అతి త్వరగా పోగొట్టి, మీ సేదను తీరుస్తుంది. ఇంకా ఈ క్రొత్త రుచికరమైన సువాసనను అందరూ ఇష్టపడుతున్నారు నేడే కొని వాడండి. దీనిని ప్రతి ఒక్కరికి ఇవ్వండి!

ప్రపంచంలో అత్యధికంగా గ్లూకోజ్ తయారుచేసే వారినుండి.




**ఆహ్లాదకరమైన రుచితో, అతి శీఘ్రంగా శక్తినిస్తుంది.**

OBM-2951 TEL











# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం . 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938 - 1972]

శుక్రవారం 27 7 '79

సిద్ధార్థినామ సం. శ్రావణ శు. తదియ

**సంపుటము 72 : సంచిక 46**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60

ఆరు మాసాల చందా రు. 20-80

విడి ప్రతి వెల 75 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం, విజయవాడ-520 003


---

## విషయానుక్రమణిక

గుర్తుంచుకోండి—

**తల్లి పాలు అన్నిటికన్నా ఉత్తమం**

ప్రకృతి యిచ్చే యీ వరానికి బదులుగా మరొకటి లేదు. అందుకే, వీలైనంత వరకూ పాపకు మీ పాలే యివ్వండి. అయితే, మీరిచ్చే చనుబాలు గనక సరిపోకపోతే, అమూల్‌స్ప్రే యివ్వడం మొదలెట్టండి.

**మొదటి నుంచీ అమూల్‌స్ప్రే యివ్వండి—అన్నిటికన్న జనాదరణ పొందిన శిశు ఆహారం**

అమూల్‌స్ప్రేకి దానికి కాగల ప్రత్యేకతలు :

- ఖచ్చితంగా సంతులితమైనది
- విటమినులతో నిండినది
- సులభంగా జీర్ణమౌతుంది
- సులభంగా కలుస్తుంది






# అమూల్‌స్ప్రేతో అభివృద్ధి మొదలౌతుంది
# దానిని బాల్‌అమూల్ పరిపూర్ణం చేస్తుంది






3వ నెల నుంచీ

**బాల్ అమూల్ కూడా యివ్వండి అత్యంత పుష్టికరమైన, పాలతో కలిసిన సీరియల్ ఆహారం**

3వ నెలనుంచీ, పాప ఎంత వేగంగా పెరుగుతాడంటే, పాప బరువు పుట్టినప్పటికన్నా రెట్టింపు అవుతుంది, మరి 3 ఏళ్ళ కల్లా పాప మెదడు 80% దాకా వృద్ధి చెందుతుంది. అందుకే కేవలం పాలు మాత్రం యిస్తే చాలదు. పాపకు ప్రోటీను, విటమినులు, ఖనిజ పదార్థాలూ ఎక్కువగా, అదీ బాగా సంతులితమైన రూపంలో అందాలి. అవి కేవలం బాల్‌అమూల్‌లోనే అన్నిటికన్న ఉత్తమమైన రూపంలో లభిస్తాయి.

**బాల్‌అమూల్ మన దేశంలోని శిశువుల కోసం ప్రత్యేకంగా తయారైంది.**

బాల్‌అమూల్, సెంట్రల్ ఫుడ్ టెక్నలాజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌వారి సహాయంతో—వెల్లూరు క్రిస్టియన్ మెడికల్ కాలేజివారిచే పరీక్షింపబడినది.

**బాల్ అమూల్‌లో మరింత పోషణ గల విలువ.**

- బ్రాండు చేయబడిన యితర మన ఆహారం, సీరియల్ ఆహారాల కంటె కనీసం 25% హెచ్చు ప్రోటీను.
- మరింత హెచ్చు కాల్షియం, విటమిన్ ఎ మరియు సి.
- కొవ్వు పదార్థాలు, ఇనుము, మరియు విటమిన్ బి కాంప్లెక్స్‌తో యిది పటిష్టం చేయబడినది.
- ముందుగానే పాలతో వండబడినది, తేలికగా అరుగుతుంది, రుచిగలది
- పప్పు, పండ్ల గుజ్జు, పుడ్డింగ్ మొదలైన వాటితో సులభంగా కలుస్తుంది.

**బాల్ అమూల్‌తో మీరిచ్చే డబ్బుకు రెట్టింపు విలువ అందుతుంది.**

ASP-AB-5/79

**ఉచితం:** సమాచారం గల అమూల్ బేబీ బుక్ మరియు బాల్ అమూల్ గ్రోత్ రికార్డ్ బుక్‌లెట్ ఇంగ్లీషులోనూ, అమూల్ బేబీ బుక్ హిందీ, తమిళం, తెలుగు మరియు మళయాళంలో కూడా దొరుకుతుంది. వాటి కోసం పోస్టు బాక్సు నం. 10124, బొంబాయి 400 001 కి, మీ పూర్తి చిరునామాతో బాటు రూ. 1.00 పోస్టేజి స్టాంపులను పంపండి.



విక్రయదారులు : గుజరాత్ కోఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్.




### కథలు

వటి పుష్మవర్మ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక పంచిక మనోరంజకంగా హృద్యంగా వుంది. ఈ వారం ప్రచురణ భాగ్యానికి నోచుకొన్న ముచ్చటైన మూడు కథలు అనుపమానములై నవరాతనానుభవములను మా ఎదలో కల్గించి ఉత్కంఠతతో చదివేలా చేసి మమ్మల్ని మురిపించి మైమరపించి మధురానుభూతినికలిగించాయి. సీరియల్స్ చాల బాగున్నాయి.

వి. ప్రసాద్. జయ, రాజా, [విజయవాడ]

*　　　*　　　*

వటి పుష్మవర్మ ద్విముఖచిత్రంగా వెలువడిన ఈ వారం పత్రిక ముఖచిత్ర సౌందర్యంలో నూతన ఒరవడి దిద్దింది పరిశ్రమ కథ నాకు చాలా బాగా వచ్చింది. థాంక్స్ టు పాలడుగు. డా. సి. నా. రె. కవిత కౌగిలం వేదాంతంతో కూడి ఆలోచింప జేసింది. సులోచనగారి ఇల్లరికపు టల్లుడు కథ కూడా చక్కగా ఉంది. తమలపాకులతో పేకాట పెళ్ళి పీటలమీదే, ఆడేస్తున్న అల్లుడిగారి [కాటూరి] కార్టూన్ బాగా నవ్వించింది. భారతీయ డాక్టర్లకు అమెరికా సత్కారం లో మొత్తం తొమ్మిది మందిలో ఆర్గురు దక్షిణాది వారు కావడం మనకి గర్వకారణం. మిగతా ముగ్గురూ ప్రశంసనీయులు. "రాగరేఖలు" సీరియల్ సంతృప్తికరంగా సాగుతోంది. "ధర్మపథంలో" బులుసు వారు 'ఉప్పుల విద్య" గురించి, లోటు పాట్లు గురించి బాగా వివరించారు. ఈ వారానికి పత్రికే హైలైట్‌గా ఉంది.

పెమ్మరాజు సూరిబాబు, [హైదరాబాద్.]

*　　　*　　　*

13—7—79 ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురించిన దుబ్బైన్ కథ చాలబాగుంది. ఇదిఒకపాంథశాల సీరియల్ ముగింపు చాలా బాగుంది.

కువారి గీతామాధురి (పార్వతీపురం).

*　　　*　　　*

నా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 13—7—79 రోజున ప్రచురించిన కథలురాసే భార్య మరియు రుగాప్రిలక్ష్మిగారి ది బ్రైన్ కథలు నాకెంతో బాగున్నాయి.

చిల్లా శివశంకర్ (గద్వాల)

# సామెతల కథలు

## చిలుక పలుకులు

**— పద్మావతి గంగాధర్.**

విన్న మాటను, స్వాలోచనలేకుండా, యథాతథగా చెప్పినప్పుడు యీ పలుకుబడిని వాడతారు.

చిలుక పలుకులు వీలా ఉంటాయో, యీ కథవల్ల తెల్సుకోవచ్చు.

ఒకానొక వూరిలో ఒక ముసలమ్మ ఉంది. ఆ ముసలమ్మకొక మనుమరాలుంది. ఆ ముసల్ది మనుమరాలిని ఎవ్వరితోనూ, మాట్లాడనివ్వదు. ఎక్కడకూ వెళ్ళనిచ్చేది గాదు. ఆ యిల్లు ఆపిల్లకొక కంచుకోట. ఆ ముసలమ్మ ఒక చిలుకను కూడ పెంచుతూండేది. ఇంటిలో పిల్లా, పంజరంలో చిలుకా, ఒకరికొకరు జత. ఆ ముసల్ది ఎప్పుడూ యింట్లోనే ఉండదు, ఊరట్టుకుని తిరిగొస్తుంది.

ఆ పిల్ల యింట్లో కూర్చొని "ఈ ముసలి ముండ ఎప్పుడు చస్తుందో" అని అనుకుంటూండేది. ఆ చిలుక ఆమాటలు వింటూండేది ప్రతిసారి. ఆమాటలు చిలుకకు కూడా వచ్చాయి. ఒక రోజున ముసల్ది పంజరం దగ్గరకు రాగానే చిలుక, "యీ ముసలిముండ ఎప్పుడు చస్తుందో" అని ముద్దుగా అంది.

ముసల్ది తన మనుమరాలవల్లనే తన పెంపుడు చిలుక చెడుమాటలు నేర్చుకొన్నదని, మనుమరాలను పట్టుకుని ఇష్టం వచ్చినట్లు తిట్టి, చిలుకను మంచిమార్గంలో పెట్టాలని ఆ వూరిలోనే వున్న శాస్త్రి యింటికి వెళ్ళింది. శాస్త్రి కూడ చిలుకనొకదానిని పెంచుతున్నాడు. శాస్త్రి చిలుకతో, తన చిలుకకు, మంచి బుద్ధులు నేర్పించమని శాస్త్రిని ముసల్ది కోరింది. శాస్త్రి తన చిలుకను తీసుకెళ్ళి కొన్నాళ్ళు ఉంచుకోమన్నాడు. సరేనని ముసల్ది శాస్త్రి చిలుకను తీసుకొచ్చి తన చిలుక ప్రక్కనే ఉంచింది. వెంటనే ముసల్దాన్ని చూడగానే ముసల్దాని చిలుక "యీ ముసలి ముండ ఎప్పుడు చస్తుందో" అంది. వెంటనే శాస్త్రి చిలుక "తథాస్తు" అంది.

చిలుక పలుకులు ముద్దుగా, తీయగా ఉంటాయి. అప్పుడప్పుడు డేంజర్ కూడాను. తస్మాత్, జాగ్రత్త!





# రాగరశ్మి

సీరియల్

మాధవపెద్ది పుణ్యశీలా ప్రసాద్



## 19

(గత సంచిక తరువాయి)

సోమయ్య, మాలక్ష్మికూడా పరిశుభ్రంగా స్నానంచేసి, మంచి బట్టలు కట్టుకున్నారు. వాళ్ళకి కావలసిన సామాన్లన్నీ రామయ్యచేత కొనిపించి ఇచ్చాను. వాళ్ళు ఎప్పుడూ శుభ్రంగా వుండాలనీ, ఇంటిని శుభ్రంగా వుంచుకోవాలనీ హెచ్చరించాను. పాపని ఎట్లా చూసుకోవాలో వివరించాను. పాపకి ఏవిధమైన కష్టమూ కలుగకూడదని చెప్పాను. పాప సుఖంగా, సంతోషంగా, ఆనందంగా, ఉత్సాహంగా గడపాలి. దాని కోసం నేను ఎంత డబ్బయినా ఖర్చుచేస్తానని చెప్పాను. పాపకెన్నో జాగ్రత్తలు చెప్పాను. పాప నన్ను వదిలి వుండాలన్నా కూడా ఏడవలేదు. దిగులుపడలేదు. మాలక్ష్మినే అంటిపెట్టుకుని వుండిపోయింది. చెప్పినవాటి కన్నిటికీ తలవూపింది.

నాకే పాపని వదలాలంటే దిగులుగా, బాధగా, బెంగగా వుంది.

గట్టిగా హృదయానికి హత్తుకుని — ముద్దులు పెట్టుకున్నాను. చీకటి పడేదాకా అక్కడే వుండిపోయాను పాపని వదలేక.

ఆ తర్వాతి రోజు రామయ్య. తమ్ముణ్ణి — మరదలిని వెంటబెట్టుకు వచ్చాడు.

రామయ్య భార్య మాలక్ష్మి చాలా మంచి మనిషిలాగా కనబడింది. మంచి కళగల ముఖం. కళ్ళల్లో నైర్మల్యం కనబడుతోంది.

సోమయ్య ఎంతో వినయంగా మాట్లాడాడు. మాలక్ష్మి పాపని ఎత్తుకుని కబుర్లు చెప్పింది. కాసేపట్లోనే పాప- మాలక్ష్మి స్నేహితులైపోయారు. పాప విషయమంతా చెప్పాను దంపతులకి. వాళ్ళకి అప్పగించబోయే బాధ్యతని జాగ్రత్తగా వివరించాను. ఎంతో శ్రద్ధగా విన్నారు ఇద్దరూ కూడా. పాపని తమ దగ్గిర ఉంచుకోవడానికి ఎంతో సంతోషంగా అంగీకరించారు. ముఖ్యంగా మాలక్ష్మి మురిసిపోయింది. ఆమె ముఖంలో మాతృప్రేమ తొణికిసలాడింది. ఆమెని చూసిన నాకు సంతృప్తి అనిపించింది. పాపని బాగా చూసుకుంటుందనే విశ్వాసం కలిగింది నాకు.

ఆ మర్నాడే ఒక మంచి ఇల్లు మూడు గదులు, వసారా ఉన్న ఇల్లు తీసుకున్నాను. పాపతో "ఆ ఇంట్లో నువ్వు మాలక్ష్మి దగ్గిర వుండాలి" అంటే వెంటనే ఒప్పుకుంది. ఆ రోజే మంచి రోజు కావడంతో వాళ్ళు ఇంట్లోకి ప్రవేశించారు. ఆ రోజే నేను పాపని సామానుతోసహా వాళ్ళింట్లో దించాను.

పాపనట్లా ఇంటినించీ సామాన్లతో సహా తీసికెళ్ళడానికి నా గుండె నెంతో దిటవు చేసుకోవాల్సి వచ్చింది. రామయ్యా నేనూ ఆరోజు అక్కడే భోజనం చేశాము. ఆ ఇంట్లో ఒక రూము ప్రత్యేకంగా పాపకి ఏర్పాటు చేశాను నేనే. మంచం, టేబిల్, కుర్చీ అన్నీ వేయించాను. పాప గుడ్డలకోసం చిన్న బీరువా పెట్టించాను అక్కడ.

చీకటి పడకముందే పాపకి అన్నం పెట్టింది మాలక్ష్మి.

కథలు, కబుర్లు చెబుతూ, ఎత్తుకుని మాలక్ష్మి పాపకి అన్నం తినిపించడం చూస్తుంటే నాకు అమితానందం కలిగింది.

పాప మాలక్ష్మితో రకరకాల ఆటలు ఆడింది. పాప ఆడమన్న ఆటలన్నీ ఆడింది మాలక్ష్మి.

"ఇంక నాకు నిశ్చింత పాప గురించి!" అనుకున్నాను.

పాప ఆడుతూ, నవ్వుతూనే మాలక్ష్మి వళ్ళో నిద్రపోయింది.

పాప నిద్రపోయాక నేను ఇంటికి బయల్దేరాను. రామయ్యని ఆరోజుకి అక్కడే వుండమన్నాను పాప దిగులుపడు తుందేమోనని. నేను దిగులుగా ఇంటికి చేరుకున్నాను. ఇల్లు బావురు మంటోంది, బోసిగా వుంది. పాప నవ్వులతో కేరింతలతో కళకళలాడిన ఇల్లు నిశ్శబ్దంగా వుంది. నిర్జీవంగా వుంది. చిన్నబోయింది. నా దిగులు అంతకంతకీ అధిక మవుతోంది.

**జరిగినకథ 9** : శిల్పకి బెంగుళూరు లోని కెనరా బ్యాంకులో ఉద్యోగం రాగా, కృష్ణ అక్కడ చేర్పించటానికి వెళ్తుంటే రైలు కోసం పరుగెడుతున్న చిత్రను చూచి అతని మనస్సు గతంలోకి పరుగెడు తుంది. తల్లి ప్రసవ వేదనతో మరణించగా, తన తండ్రి అయిన వెంకట్రావ్ ను చిత్ర ద్వేషించటం కృష్ణకు చిత్రంగా తోస్తుంది. అవివాహితు డైన తనతో శిల్ప ఉంటున్న కారణంగా ఆమెకు వివాహం జరగదేమోనని బాధపడ్తాడు కృష్ణ. అరుణ్ తో అర్చనకి పెళ్ళి నిశ్చయమయిం దని శిల్పకి చెప్తుంది వైదేహి. అర్చనని పెళ్ళి చేసుకోవటం అరుణ్ కి గాని, అరుణ్ ని పెళ్ళి చేసుకోవటం అర్చనకి కాని యిష్టముండదు. అరుణ్, శిల్ప ఒకరి నొకరు ప్రేమించుకుంటారు. చిత్రని పెళ్ళి చేసుకుంటానని ఆమె తండ్రి వెంకట్రావ్ తో కృష్ణ చెప్పగా, ముహూర్తం పెట్టిస్తాడు. శిల్ప పూర్వ వృత్తాంతం గురించి అరుణ్ తో చెపుతూ వుంటాడు కృష్ణ. తను ప్రయాణించే రైలులో దొరికిన పాపను తీసుకొని తన ఇంటికి చేరుకుంటాడు కృష్ణ. ఆ పాప మూలముగా కృష్ణ, చిత్రల మధ్య మనస్పర్థలు చెలరేగుతాయి.

ఒంటరిగా వుండలేననిపించింది. నిద్ర పట్టలేదు.

రోజూ నా ప్రక్కనే - నామీద చెయ్యేసుకుని నిద్రపోయేది పాప.

ఇవాళ పాప నా ప్రక్కన లేకపోతే నాకు నిద్ర ఎట్లా పడుతుంది?

"బాబాయ్..." అంటూ దాగుడుమూతలాడేది. కళ్ళు మూసేది తన చిన్నారి చేతులతో.

అన్నం తినేటప్పుడు తన కిష్టమైనవి నా కంచంలోంచి తీసేసుకునేది. తన కంచంలోంచి తీసి నానోట్లో పెట్టేది.

క్యారం బోర్డు ఆడేది.

ఈ మూడు నెలల కాలంలో - నాలో ఇంత అనురాగం ఎట్లా పెరిగింది - పాప పట్ల? నాకే ఆశ్చర్యంగా ఉంది. లేచి వెళ్ళి పాపని తెచ్చేసుకుందామని - ఎన్నోసార్లు బలంగా అనిపించింది. ఏదో ఆవేదన! కానీ - నన్ను నేనే నిగ్రహించుకున్నాను.

బలవంతాన ఆలోచనలు చిత్రకేసి తిప్పుకున్నాను. ఈ విషయం విన్న చిత్ర చాలా సంతోషపడుతుంది.

ఏమిటో ఈ ఆలోచనకి నాకు చిత్ర అంటే ఒక రకమైన ఉదాసీన భావం కలిగింది!

*　　*　　*

కళ్ళు తెరిచి చూస్తూండగానే తెల్లవారిపోయింది. మాటి మాటికీ మనసు పాప వైపు పరుగు తీస్తున్నా, దాన్ని బలవంతాన పట్టి ఆపుతున్నాను. ఇవాళే వెళ్తే? అసలు నేను రోజూ వెళ్తే వాళ్ళేమన్నా అనుకోవచ్చు. కొన్నాళ్ళయినాక వెళ్ళి చూసి వస్తాను. అదీగాక పాప నన్ను చూడంగానే ఇంటికి వచ్చేస్తానంటే? వాళ్ళకంటూ అప్పగించాక, వాళ్ళని అనుమానించినట్లు వాళ్ళు భావించవచ్చు.

ఇట్లా ఆలోచించి రామయ్యని పంపించాను. రామయ్య వచ్చి పాప బాగా ఆడుకుంటోందనీ, రామయ్యని చూశాకగానీ 'నేను' గుర్తుకు రాలేదనీ చెప్పాడు. ఆ మాటకి నాకు సంతోషం, బాధా కూడా కలిగాయి! పాప గురించి రామయ్య చెబుతున్న కబుర్లన్నీ వింటూ కూచున్నాను.

ఆ తరువాత రోజు పాపకి క్యారంబోర్డు, బంతీ, బొమ్మలూ అన్నీ ఇక్కణ్ణించి పంపించాను. రోజులు గడుస్తున్నకొద్దీ పాపని మర్చిపోలేక పోతున్నాను. ప్రతి క్షణం గుర్తుకు వస్తోంది.

పాపని మాంటిస్సోరీ స్కూల్లో చేర్చాలని నిశ్చయించుకున్నాను. వూళ్ళోవున్న మాంటిస్సోరీ స్కూళ్ళు కొన్నింటిని చూసివచ్చాను.

నాకు బాగా నచ్చిన స్కూళ్ళ హెడ్సుని కలిసి - మాట్లాడాను.

వాళ్ళ తరువాత టర్మనింపి సీటు



ఇస్తామన్నారు. రోజులు గడుస్తున్నాయి. నా ఒంటరి తనం నన్ను వదల్లేదు. కాని విచిత్రమేమిటంటే అంత ఒంటరి తనం లోనూ చిత్రని చూడాలని నాకు అనిపించనే లేదు. నేను చిత్ర ఇంటికీ వెళ్ళలేదు.

చిత్ర తండ్రి వచ్చి నేను చేసిన పనికి నన్ను మెచ్చుకున్నాడు. ప్రశంసించాడు.

చిత్రని పంపిస్తానన్నాడు. నేనేం మాట్లాడలేదు నా మౌనం చూసి ఏమనుకున్నాడో ఏమో - పెళ్ళిని గురించేమీ మాట్లాడకుండా వెళ్ళి పోయాడు. వారం రోజులు గడిచాయి.

ఇంక పాపని చూడకుండా వుండలేననిపించింది - నాకు. ఆ రోజు ఆదివారం ఇంట్లోనే వున్నాను.

రామయ్య రోజులాగే పాపని చూడ్డానికి వెళ్ళాడు. ఇంకరాలేదు.

రామయ్య వచ్చాక నేను వెళ్దామని ఎదురుచూస్తున్నాను.

రామయ్య ఎంత సేపటికీ రాలేదు.

నేనింక ఆగలేకపోయాను.

నేను వెళ్ళి కనీసం - కొన్ని గంటలన్నా పాపతో గడపాలంటే ముందే వెళ్ళాలి. చీకటి పడ్డాక వెళ్ళీ లాభంలేదు.

నేను వెళ్దామనుకుంటున్నట్లు రామయ్యకి తెలీదు. అందుకే ఇంకారాలేదు అనుకుంటూ బయల్దేరాను. పాపకోసం బిస్కెట్లూ, కాడ్‌బరీ చాక్లెట్లూ కొన్నాను. అవి తీసుకుని బయల్దేరాను.

పాపని చూడబోతున్నానని ఎంతో ఉత్సాహంగా వుంది నాకు.

పాప నన్ను చూడంగానే ఎట్లా పరుగెత్తుకొస్తుందో వూహించుకుంటున్నాను. వాళ్ల ఇల్లు సమీపించాను. తలుపు చేరవేసి వుంది. తలుపు కొట్టబోయి — ఆగిపోయాను. మాలక్ష్మి గొంతు ఏడుస్తూ వినబడుతోంది.

"అయ్యగారికి నా ముకం ఎట్లా చూపించను ?"

నేను నిలబడి పోయాను అప్రయత్నంగా.

"ఈడు రోజురోజుకీ అద్వానంగా తయారవుతున్నాడు రామయన్నా... తాగుడు మరీ ఎక్కువవుతోంది. మొన్న పాపని వదిలినప్పుడు అయ్యగారు రెండొందలిచ్చారా ... అదంతా ... పట్టుకుపోయి ... తాగేశాడు. ఇదివరకు ఇంట్లోవుండే ఏ రూపాయో, రెంగతో ఏ సారాయో, పాడో తాగేవాడంట. ఇప్పుడు ఇంకేదో ఖరీదైనదంట తెచ్చుకున్నాడు. డబ్బు నేనివ్వకపోతే, ఆడి చేతులు పడిపోవూ! పాప చూస్తుండగానే నన్నుకొట్టి, ఒళ్ళు హూనం చేసి లాక్కుపోయాడు. పిల్ల గూడా భయపడిపోయింది. నేనేం చేసేది? నువ్వే చెప్పు! ఇట్టాంటి మొగుణ్ణి పెట్టుకుని నేనీ పాపనెట్లా పెంచేదయ్యా? పచ్చడి మెతుకులూ, గంజినీళ్లూ ఆ పాపకి, బంగారుతల్లికి ఎట్లా పెట్టేదయ్యా? ఎరక్కపోయి, బుద్ధి తక్కువయ్యా ఈ బాధ్యతని నెత్తికెట్టుకున్నానేమో అని పిస్తోంది. పిల్లలంటే వున్న ప్రేమతో ఇయన్నీ ఆలోచించలేదు నేను! నేను పెంచలేనయ్యా ఈ పాపని! ఈ అన్యాయం నేను చెయ్యలేనయ్యా పద ఇప్పుడే ఎళ్లి అయ్యగారికి అన్నీ చెప్పేసి, పాపనిచ్చేసి వద్దాం. ఆయన భగమంతుడి నాటోరు. మనకిన్ని అమరిచినా మనకే ఆ యోగ్గెత లేదు..."

"నువ్వు తొందరపడకు మాలచ్చిమీ. వాడికి నచ్చచెప్పి సూద్దాం. నేను అయ్యగారిచేత గూడా చెప్పిస్తాను..." రామయ్య గొంతు.

"ఏం చెప్పడమోనయ్యా. ఆడి పద్దతి ఏమీ బాగాలేదు. నీకు చెబితే అరదం గాదు. తాక్కుండా వుంటే ఆడు మంచోడే. కానీ ఆడుండడు గదా. డబ్బు చూస్తే చాలు నిలదొక్కుకోలేడు. సివరికి ఎంతగా దిగజారి పొయ్యాడంటే... ఈ ఇంటివంట అద్దెకిస్తాడంట. 'మనం వుండడానికి ఒక గది సాల్దా?' అంటున్నాడు సూశావా ఆడిబుద్ది ? అద్దె కట్టేది అయ్యగారు — అందులోనూ లాబం పొందాలని సూస్తున్నాడు... ఇప్పుడు సెప్పయ్యా...నన్నేం సెయ్యమంటావో..."

మాలక్ష్మి మాటలు వింటుంటే నాకు ఆవేశం వచ్చింది.

కాళ్ళు గజగజ వణికాయి. ఇంక ఆగలేక పోయాను. తలుపుతోసుకుని లోపలికి వెళ్ళాను. హఠాత్తుగా తలుపు తెరుచుకోవడంతో ఉలిక్కిపడ్డ మాలక్ష్మి, రామయ్యా నన్ను చూడ్డంతో నిర్ఘాంతపోయారు! నోట మాటరాక నిలిచిపోయారు!

పాప ఒక మూల దీనంగా నిలబడివుంది!

నన్ను చూడంగానే... 'బాబాయ్...' అంటూ పరుగెత్తుకొచ్చింది.

మాలక్ష్మి ఏడుస్తూ నా పాదాలమీద వాలిపోయింది! అప్పుడే... తూలుకుంటూ లోపలికి వచ్చాడు సోమయ్య. "మీ...మీరా— బాబ...య్యా ...దం-డాలు..."

చైతన్యం తెచ్చుకున్నరామయ్య తమ్ముడు చెంప ఛెళ్ళు మనిపించాడు.

నేను రామయ్య చెయ్యిపట్టుకుని ఆపి— పాపని తీసుకుని—మౌనంగా వెనక్కి తిరిగి ఇంటిదారి పట్టాను.

ఆరోజే — ఆ క్షణమే — అప్పుడే — నిర్ణయించుకున్నాను. ఇంక పాపని ప్రాణం పోయినా ఎక్కడా వదలనని! పాప నా దగ్గిరే వుంటుందని! పాపని పెంచి పెద్ద చేసి, చదువు చెప్పించి, పెళ్లి చేసె బాధ్యత నాదేనని! పాపని నా కూతుర్నిగానే చూసుకుందామని! పాపని ఎన్ని అడ్డంకులు వచ్చినా, ఎవరికోసమైనా సరే — ఎక్కడికీ పంపించే ప్రయత్నం గూడా చెయ్యగూడదనీను- అవసరమైతే పెళ్ళి కూడా మానుకోవాలనీను! అదే నా నిర్ణయం. అంటే — అంటే !! ఇది నిజంగా భీష్మ ప్రతిజ్ఞే! ఈ నిర్ణయానికి వచ్చాక గానీ నాలోని అశాంతి చల్లారలేదు. ఆవేశం ఆగలేదు. చిత్రకిది ఇష్టమైతేనే నన్ను చేసుకుంటుంది. లేకపోతే లేదు! అంతే.

## 20

తిరిగి వచ్చాక రామయ్య నన్ను దీనంగా క్షమాపణ వేడుకున్నాడు.

"నువ్వేం చేస్తావు రామయ్యా. దీంట్లో నీ తప్పేంలేదు" అని నేనే సర్దేశాను.

* * *

ఆ రోజు నించీ నా దినచర్యే మారిపోయింది. పాపే నా లోకమయి పోయింది. తరువాత రెండు రోజులకి వచ్చిన చిత్ర తండ్రికి నా నిర్ణయం చెప్పాను. ఆయన ఇంకేదో నచ్చచెప్ప బోయాడు. నేను వినలేదు. ఆ తరువాత చిత్ర వచ్చింది. అదే మాట చెప్పాను చిత్రతో గూడా.

"పాపని కన్న కూతుర్నిగా చూసుకో గలిగితేనే మన పెళ్ళి జరుగుతుంది" అని గూడా చెప్పాను. కోపం వచ్చిందామెకు. ఏడ్చింది. బతిమాలింది. వాదించింది. కానీ



# రాగరేఖలు

నాతో మాత్రం ఏకీభవించలేదు. నేను నా మాటమీదే వున్నాను.

"ఏం అనాథ శరణాలయంలో చేర్పిస్తే? అన్నీ మీ ఊహలేగాని చేర్పించగూడదూ?"

"ఏమో అది నా మనసుకి నచ్చలేదు."

"మీ కసలు నన్ను పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేదు. దానికిదో వంక. మీకు నామీద నిజంగా ప్రేమలేదు. ప్రేమంటూ వుంటే ఇట్లా చెయ్యరు."

"నాకు నీమీద ప్రేమ వుందో, లేదో — నువ్వు అర్థం చేసుకోక పోవడం నా దురదృష్టం చిత్రా! నేను ప్రేమించిన ఒకేఒక స్త్రీవి నువ్వే—నేను పెళ్ళి చేసుకుంటే నిన్నే చేసు కుంటాను. లేకపోతే బ్రహ్మచారిగానే వుండి పోతాను. నా జీవితంలో ఇంకో స్త్రీ భార్యగా ప్రవేశించడం మాత్రం జరగదు."

"మరి నామీద అంత ప్రేమ వున్నవారు నాకోసం-నాకోసం పాపని."

"సారీ చిత్రా! పాపని మాత్రం నేను వదులుకోలేను. నువ్వేమనుకున్నాసరే-"

"అయితే నన్ను వదులుకో గలరన్న మాట..."

"అని నేననలేదు. నాకు మీ ఇద్దరూ కావాలి."

"ఇంక మీనిర్ణయం మారదన్నమాట?"

"అవును-"

"అయితే ఇదే మన ఇద్దరి ఆఖరి కలయిక అన్నమాట-"

"కాకూడదనే నా కోరిక-"

"కాకుండా ఎట్లా వుంటుంది? మీరు ప్రపంచం దృష్టిలో ఆదర్శమూర్తులు కావచ్చు—కానీ — ఒక ఆడపిల్లని బాధ పెట్టడం—నమ్మించి—వెళ్ళగొట్టడం ఆదర్శ మనిపించుకోదు."

'ఇది నేనే ఆదర్శాలకోసం చెయ్యడం లేదు. నా ఆత్మ సంతృప్తి కోసం చేస్తున్నాను. అంతే. అందుకు నిన్ను సహకరించ మంటున్నానుగానీ, నేనింకేమీ అనడంలేదు.'

చిత్ర మాట్లాడలేదు. మౌనంగా లేచి వెళ్ళిపోయింది.

ఆ తరువాత మా యింటికి రావడం మానుకుంది. మా యిద్దరి మధ్యా వచ్చిన అభిప్రాయభేదానికి నేను ఆ తరువాత కొన్నాళ్ళు చాలా బాధ పడ్డాను. క్రమ క్రమంగా పాప ఆటలలో— ముద్దు మాటలలో నా బాధని మర్చిపోగాను. పాప ఆటలలోనే నా సెలవులన్నీ అయిపోయాయి. సెలవులయ్యాక పాపని స్కూల్లో చేర్పాలను కున్నాను.

ఆ రోజు మంచి రోజని అప్లికేషన్ తెచ్చి పిలప్ చేశాను. దాంట్లో పాప పేరూ, పుట్టిన తేదీ, సంవత్సరం రాయాల్సివచ్చింది. అంతదాకా పాపకి పేరు పెట్టాలనే ఆలోచన గూడా రాలేదు నాకు. మూడు రోజులు ఆలోచించాను పాప పేరుకోసం! ఎన్నోపుస్తకాలు తిరగేశాను.

చివరికి నాకు నచ్చిందో పేరు. పాప అందానికీ- ముగ్ధత్వానికీ తగ్గ పేరు! ఏదైనా చెప్పేటప్పుడూ — కథలూ, కబుర్లూ, వినేటప్పుడూ. కన్నార్పకుండా చెక్కిట చెయ్యిచేర్చి— చెక్కిన శిల్పంలాగా కూచునేది పాప! అందుకే పాపకి- శిల్ప సుందరి అని పేరు పెట్టాను. అతికినట్టుగా వుందా పేరు—పాపకి! చక్కగా అమిరింది! రామయ్య గూడా చాలా సంతోషించాడు— చాలా బావుందన్నాడు.

రామయ్య నాకు ఎంతో సహాయంగా ఎన్నో విధాల సహకరిస్తున్నాడు. ముఖ్యంగా ఇట్లాంటి సమయంలో నాకు బలం కలిగిస్తున్నాడు.

అంచనామీద పుట్టిన సంవత్సరాన్ని దొరికిన రోజుని పాప పుట్టినరోజుగానూ లెక్కకట్టి అప్లికేషన్‌లో వేశాను. పేరు పెట్టిన రోజున పండుగ చేసుకున్నాము.

శిల్ప స్కూల్లో చేరింది. నాకు చాలా సంతృప్తిగా వుంది. రామయ్య స్కూలుకు వెళ్ళి పాపని దింపి, మళ్ళీ తీసుకు వస్తుండేవాడు. శిల్పకిస్కూలు చాలా నచ్చింది.

చాలా మందితో స్నేహం కలిపింది — కూడా! తల్లిదండ్రుల్ని పూర్తిగా మర్చిపోయింది శిల్ప. తరవాత కొన్నాళ్ళకి మాలక్ష్మి మా ఇంటికొచ్చి — పాప పన్నీ చూస్తానని అడిగింది. నేను ఒప్పుకున్నాను.

పాపని మాలక్ష్మి అత్యంత శ్రద్ధతో చూసుకుంటోంది. కాలం వేగంగా గడిచి పోతోంది. ఒకరోజున రామయ్య నాకో వార్త చెప్పాడు-చిత్రకి వేరే పెళ్ళి సంబంధాలు చూస్తున్నారని! ఆరోజు నేను నిజంగా చిత్రవధ ననుభవించాను. కానీ — పైకేమీ మాట్లాడలేదు. కానీ మామూలుగా వుండలేకపోయాను. మనసు బలవంతాన మళ్ళించుకోవలసి వచ్చింది. మరో రెండు నెలలకు — చిత్ర పెళ్ళి మరొకరితో జరిగిపోయింది!! చిత్రకీ—నాకూ వున్న సంబంధం తెగిపోయింది. చిత్ర నాకు శాశ్వతంగా దూరమైంది!

(ఇంకా వుంది)



# వారఫలం

### విద్వాన్‌కోట సత్యరంగయ్య శాస్త్రి.

## 27–7–1979 శుక్రవారం మొదలు 2–8–1979 గురువారం వరకు

**మేషం :** ఎన్నో ఆలోచనలతో, వ్యాపారాభివృద్ధికి, ఉద్యోగంలో ఉన్నత స్థాయికి పోవటానికి ప్రయత్నిస్తారు. కాని, మిక్కిలి దగ్గర వారివల్లనో, బంధువులవల్లనో, పనివారివల్లనో చికాకు సంభవం. ఆదాయానికి ఏవిధంగా లోపంలేదు. మరీ చెప్పాలంటే అభివృద్ధి కూడ కనిపిస్తుంది. 2వ తారీఖు ముఖ్యవిషయాలను పరిష్కరించుటకు అనువైనదినం. స్త్రీలకు :— కృషి రాణింపు, ఉద్యోగంలో స్థాయి కనిపిస్తుంది. హాయి చిక్కుతుంది.

**వృషభం :** గ్రహస్థితి ఉద్రేకపూరితంగా మిమ్ములను చేస్తుంది. కోపం తెచ్చుకోవటం తగదు. జరుగవలసిన పనులుకూడ చెడిపోతాయి. మనస్పర్థ లేర్పడే వారం. కోపం తాపానికి కారణం. వెనుక చింతించిన ఏం ప్రయోజనం? రాబడి సామాన్యం. స్త్రీలకు : విద్యారంగంలో, కళారంగంలో కృషిచెయ్యండి. పేరు చేకూరుతుంది నిదానంగా.

**మిధునం :** సాహసంతో, కృషి చేస్తారు. రాణింపు వస్తుంది. పలువురిలో పేరుప్రతిష్ఠలుంటాయి. ఖ్యాతి కొరకు ప్రాకులాడుతారు. 28వ తారీకున ప్రయత్నించిన పని సానుకూలమవుతుంది. వృత్తిలో ఎంత కృషి చేస్తే అంతగా పేరు చేకూరేవారం. స్త్రీలకు : వృత్తిలో, గృహకార్యాలలో మెరుగు కనిపిస్తుంది. ఆరోగ్యలోపంలేదు.

**కర్కాటకం :** ప్రయత్న లోపం కనిపించరాదు. సహజంగా పట్టుదలగలవారు, ఆశించినవి సఫలం కాలేదని ఆవేదన పడుతారు. దానివల్ల ప్రయోజనం మాత్రంలేదు. అనుకున్నంత లాభం రాలేదనే తాపత్రయం, అత్యాశ, యివి ఈవారం, మీరాశి ప్రత్యేక లక్షణాలు. నూతన వ్యవహారాల్లో జోక్యం ఉంటుంది. స్త్రీలకు : ప్రయత్నములు ఫలించి, ప్రయాణానుకూలత వల్ల, విస్తరణ కార్యక్రమం చేపడుతారు.

**సింహం :** ఇంకా ఆరోగ్యం కుదుట పడలేదని మీరే గ్రహిస్తారు. గ్రహస్థితి, అనుకున్నంతగా యోగదాయకంగాదు. గట్టిగా నమ్మి లాభదాయకంగా పరిణమించాలన్న పనులు వృధాగా చెడిపోవటం, అవకాశాలు జారిపోవటం సంభవం. ఆత్మబంధువుల రాకవల్ల కూడా చికాకు కల్గుతుంది. స్త్రీలకు :విద్యార్జన విషయంలో చాలమందికి నిరుత్సాహంగా ఉంటుంది. మిగతా విషయాలు సాధారణంగా జరుగుతాయి.

**కన్య :** కృషికి రాణింపు, మన్నన లభించటంతో, పై వారి ఆదరం లభించటంతో, యింకా ఉత్సాహంగా పనులు చేస్తారు. ఫలిస్తాయి. తోడబుట్టిన వారిని గూర్చినచింత, ఆలోచనలుంటాయి. పెట్టుబడితో వ్యాపారం చేసేవారికి అమితలాభాలుంటాయి. స్త్రీలకు : ఏ విధంగా లోపంరాదు. క్రొత్త విషయాల్లో జోక్యం, తద్వారా అనుకున్నంత లాభం 29వ సంభవం.

**తుల :** ఈవారం, ఈరాశిలో జన్మించిన వారికి, చాలామందికి భూగృహ విషయాలు పరిష్కరింపబడుతాయి. సోదరుల మూలంగా, అనుకూలత ఏర్పడుతుంది. క్రమంగా, మంచి జరుగుతుంది. మన ప్రయత్నాలు అనవసరమని గ్రహించగలుగుతారు. మీ కృషికన్న, మీ అదృష్టమే కారణం అని గ్రహింపగలుగుతారు. స్త్రీలకు :— సర్వవిధాలా అభివృద్ధి. సర్వానుకూల దినం 30వ తారీకని గ్రహిస్తారు.

**వృశ్చికం:** అనుకున్న పనులు, ఆశించిన లాభం, ఆప్తులవల్ల జరుగవలసినపనులు జరుగుతాయి అనుకోవటం మంచిదికాదు. గోచారం అంతగా అనుకూలంగా లేదు. ఎంతటి ఆప్తులతోనైనా మీ మనోగతాభిప్రాయాలను బయటపెట్టకండి. స్త్రీలకు : గృహకార్యభారం తప్ప, వేరొక విధంగా పేరుచేకూరుతుందని చెప్పవీలులేదు.

**ధనుస్సు :** ఎంత సాహసకార్యానికైనా, ఏ పని ఎలాగైనా, సాధించుకోవలెనని, రాశివారు ప్రయత్నిస్తారు. ఏంలాభం? గ్రహానుకూల్యత యింకా యోగాభివృద్ధికి దోహదం చేయుట లేదు. స్నేహితులతో, ఆలోచనలు చేయండి, ప్రయత్నించండి. వ్యాపార విస్తరణకు ప్రయత్నించండి. స్త్రీలకు : ఉద్యోగాభివృద్ధి, కొందరకు ప్రమోషన్ వారంలో ముఖ్య సంఘటన.

**మకరం :** ఆదాయం, ఆనందం, ఉత్సాహం, సభాజయం, సాహిత్యంలో ప్రముఖ వ్యక్తులుగా గుర్తింపబడుటకు, గ్రహబలాధిక్యత గలదు. జ్యోతిషం నమ్మకమున్న మంచిఫలితాన్ని యిచ్చిందని గ్రహించటకు ఎంతోకాలంపట్టదు. ఆరోగ్య విషయంలో శ్రద్ధ అవసరం. స్త్రీలకు : ముఖ్యంగా కళ, క్రీడా వ్యాసంగంలోని వారికి ఉత్తమకాలంగా చెప్పవచ్చు. 29 తారీకు లాభదాయకమవుతుంది.

**కుంభం :** పలువురితో కలసి సంఘ కార్యాచరణ సునాయాసంగా జరుపుకుంటారు. అనుకున్నట్లు జరుగుటతో, ఆనందంగా వారం జరుగుతుంది. పెద్దల ఆశీర్వచనం ఫలించి, చిత్రరంగంలో ప్రగతి సూచించే గ్రహస్థితి ఉంటుంది. స్త్రీలకు : ఉద్యోగ, క్రీడ, కళారంగంలోని వారికి అనుకూలం.

**మీనం :** గ్రహబలం మీకు సర్వానుకూలం. లాభదాయకం. అలాంటి లాభం కనిపించేటప్పటికి, అభివృద్ధి చేకూరుతుంది. పలువురితో పరిచయం, కళారంగంలో లాభం, పత్రికారంగంలో ఆదాయం, ఉద్యోగంలో పేరు చేకూరుతుంది. స్త్రీలకు : విలాస కార్యక్రమానుభవం, క్రొత్తవస్తుసేకరణ సమకూడుతుంది.



ఆఫీసుకు ఎగనామం పెట్టిన అప్పారావు ఆరోజు గుమ్మందగర నిలబడి పోస్ట్‌మాన్ కోసం ఎదురు చూస్తున్నాడు రేపల్లెలో రాధ మాధవుడి కొసం వేచినట్లు.

# అప్పారావు ఆత్మహత్య

ఆ వీధిలో ఎవరికీ వుత్తరాలు రాకపోయినా, అప్పారావు కోసమైనా పోస్ట్‌మేన్ ఆ వీధికి రావల్సిందే అలాగే ఆ రోజూ వచ్చి, ఎప్పటిలాగే ఓ కవరిచ్చాడు. కవరు విప్పి చూడగానే అప్పారావు ముఖం 'జీరోవాట్' బల్బు అయిపోయింది. ఎందుకంటే తను పంపిన 'తిరిగొచ్చిన కథ' నిజంగానే తిరిగొచ్చేసింది విసుగుతో లోపలికొచ్చి వాలు కుర్చీలో వాలిపోయాడు. 'ఎందుకు తన కథ వాళ్ళకి నచ్చలేదు... ఏమిటిలోపం. తనెంతో కష్టపడి వ్రాశాడే...' ఆలోచనల్లో పడ్డాడు. ఆలోచనల్లోంచి మరో కథ వ్రాయడానికి కూర్చున్నాడు యింకు బాటిలు తీసుకుని, కాగితాలకట్ట వేసుకుని 'ఈసారి తన కథ ఎలాగైనా అచ్చులో చూసుకోవాలి' సంకల్పం తన బుజ్జిగాడు ఈసాకి కొనమన్నంత దృఢంగా వుంది. కొబ్బరికాయ కొట్టి మరీ కథ వ్రాయడం ప్రారంభించాడు. వ్రాయడం-పంపడం-తిరిగిరావడం. ప్రేమ-పెళ్ళి-పిల్లలులా జరిగిపోతున్నాయి. 'అసలు తన కథలు ఆ పత్రికల వాళ్ళు చదువుతున్నారా' అనుమానము, అసహ్యమూ చెట్టాపట్టాలేసుకుని లవర్స్‌లా వచ్చేశాయి.

పంపిన ప్రతి కథా అప్పారావుని విడిచి వుండలేకపోతోంది. ఆఫీసులో సర్వీసును మించిన అనుభవం పత్రికల్ని చదవడంలో సంపాదించేశాడు. 'ఈ మధ్య పత్రికలలో అన్నీ నవలలు వ్రాసేవారి కదలే కనిపిస్తున్నాయి! అందుకే నావి పడటంలేదు కాబోలు. అంటే నేనూ ఓ నవల గీసేస్తే?' మనసులో ప్రశ్నించుకున్నాడు ... వెంటనే పాత ట్రంకుపెట్టె తెరిచాడు. దాన్నిండా తన తిరిగొచ్చిన కథలు, రంగు రంగుల బొద్దింకలూ వున్నాయి. ఒకటొకటిగా తీసి (బొద్దింకల్ని కాదు కథల్ని...) ఏదో ఒకలా కలిపి నవలగా మార్చాలని నిర్ణయించుకున్నాడు. ఇంతలో బాత్రూమ్‌లో స్నానం చేస్తున్న భార్య వరలక్ష్మి పొయ్యిమీద పాలు చూడమనడం, అప్పారావు కొస్తున్న అయిడియాస్ వినబడకుండా చేసేశాయి. దాంతో, పాలు పొంగిపోయేసరికి వరలక్ష్మికి లెక్కడలేని విసుగూ బయలుదేరింది. తన





మంత్రవాది మహేశ్వర్

కుండే కోపాన్ని కూడా విసుగుతో కాఫీలో చక్కెర కలిపినట్లు కలిపి, "ఏ వ్వ డూ కథలే ... పాడు కథలు" అని గట్టిగా ఒత్తి పెట్టి పలికింది.

అప్పారావుకి మండిపోయింది పచ్చిమిరప కాయ కొరికినట్టు ఫీలై...,

"ఏమిటే నావి పాడుకథలా ... కాలం కలిసిరాక ఈ అప్పారావు అవస్థయిలా వుంది గానీ టపటపా నావో నాలుగు కథలు పడ్డాయంటే యింటిముందు సినిమా ప్రొడ్యూసర్స్ లైను లో నిలబడతారే ఫ్రెరిదానా" అన్నాడు.

"ఆఁ ఆశకేం తక్కువలేదు."

వరలక్ష్మి వయ్యారంగా అన్నా అప్పారావుకి అందం కనిపించలేదు

"ఆశకాదే నా కష్టానికి ఫలితం, నా తెలివికి నిదర్శనం. అంతెందుకు యిప్పుడు నే వ్రాస్తున్న నవలపడని, ఆదలా వుంచు నిన్న నే పంపిన కథ పడనీ. యిగో నీకో చీర కొనిస్తా" ఆశ చూపించాడు తనని ఆకాశానికి ఎత్తలేకపోయినా, కొద్దిగానైనా పొగడాలని.

"ఆఁ ఏడిసినట్టే వుంది మా అమ్మగారూ వాళ్ళు బట్టలు పెట్టారు కనుక సరిపోయింది. మీ కథ పడంతో నా బట్టలు ముడెడితే పిగ్గుపడి యింట్లోనే పడి చావాల్సొచ్చేది."

వరలక్ష్మి మాటలు అప్పారావు ఓర్పుకి పరీక్షగా నిలుస్తున్నాయి.

"అంటే నా కథలు పడవంటావు. నన్ను అవమాన పరుస్తున్నావు... నేనేం అనుకోటం లేదు. కానీ నాలోని రచయితను అవమాన పరచటమే నాకు ఒళ్ళు మండి పోతోంది అయినా మొదట్నుంచీ భర్తను ఎంకరేజ్ చేయాల్సిందిపోయి డిస్‌కరేజ్ చేస్తావా. నా రచనలంటే నీకు మొదట్నుంచీ చిన్న చూపే" — మాగా మార్కులొచ్చిన విద్యార్థి రిజర్వేషన్‌లో ఎవడో చవట తనకి కాకుండా సీటు కొట్టేసినపుడు కలిగేలాంటి బాధతో అనేశాడు.

ఆ రోజున కొన్నవారపత్రికను తిరగేస్తున్నాడు... ఒక్కొక్క కథను చూస్తుంటే అప్పారావు కళ్ళు నీళ్ళల్లో వున్నాయో, కళ్ళల్లో నీళ్ళున్నాయో తెలియటం లేదు.

ఉత్తరాల శీర్షికలో ముందు సంచికలోని

## సమాధికి సమాధి

"స స్య శ్రీ"

— ఇవేమిటీ వింత భయాలు ?
తాజ్‌మహల్‌కి సోకిందట స్ఫోటకం
రాజకీయ కాలుష్య కర్కాటకం!
— ఇవేమిటి అపస్వరాలు ?
అమర ప్రేమ దేవళం పై
అమ్ల వర్ష పాతం;
భరత పక్షిగళంలో చరమ 'హంస గీతం'!
— అవేమిటా రంగుల నీడలు ?
మధురానగరి శాపానికి
మసిబారుతున్న మణిదీపం;
శిల్పసుందర స్వప్నానికి
సల్ఫర్ డయాక్సైడ్ ధూపం!
— ఏమిటికి పోతావీ రాత్రి ?
విషమ రాజకీయాల
విషవలయాల ఉరినుండి
వివేకానికీ, విజ్ఞానానికి విలువలుగలదరికి!

(ప్రశ్నలు మాత్రం 'శ్రీశ్రీ' వి.)

రచనలపై అభిప్రాయాల్ని చూస్తూ చటుక్కున ఆగిపోయాడు "మందు రాంబాబుగారు వ్రాసిన 'గాజులు' కథ నాకు చాలా నచ్చింది. కాని ఆయన చివరలో ప్రేమికులు కలుసుకున్నట్లు చేస్తే పరిపూర్ణత లభించేది కొన్ని కొన్ని సందర్భాలు చదువుతుంటే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఇటువంటివే మంచి కథలు వేయండి... రచయితకు కృతజ్ఞతలు" — క్రింది తన భార్య వరలక్ష్మి పేరుంది... ఇదేమిటి యిదిలా వ్రాయటం ఎప్పట్నుంచి కొంపదీసి తనకు తెలీకుండా కథలు కూడా వ్రాసేస్తోందా పడితే... అమ్మో అలా జరిగితే తనలోని రచయిత...? తనిన్నాళ్ళనుంచీ వ్రాస్తుంటే పడకుండా, తన పెళ్ళానివి పడితే చులకనైపోదూ... నో... అలా కానడానికి వీల్లేదు.

"మొక్కై వుండగానే వంచేయాలి. పుత్తరాలకు మించి ఎదగనివ్వకూడదు దీన్ని..." నిర్ణయించేసుకున్నాడు కులమతాల పేరుతో తెలివితేటల్ని అణచేస్తున్నట్లు.

"ఏమేవ్..." పిలవడంకాదది అరిచాడు. ఆ అరుపుకి గోడమీద వాలిన పిట్టలు భయపడి ఎగిరిపోయాయి. ఇంటివాళ్ళబ్బాయి


( 39 వ పేజీ చూడండి)

నై శేట్   ఉరవకొండ

ఆడది మగవాడికి జీతం లేని పని మనిషి అంటే అతిశయోక్తి కాదు

కాదు పరమ సత్యం. వాకిలి ఊడ్చడం, ఇంటి చాకిరీ, సరైన తిండి ముఖ్యంగా గడపక చాలా మంది కట్నాలు పుచ్చుకు అడ్వాన్స్‌గా కేపిటల్‌తో సహా పెళ్లాల్ని తెచ్చుకొంటున్నారు. ఇలాంటి పరిస్థితి కాబట్టే— 'నీతో కాపురం చేయను' అన్నందుకు భార్యని హతమార్చే వాళ్ళూ, 'నా బట్టలు ఉతక లేదు. నేని అవమానం సహించలేను' అని ఆత్మహత్యకు పాల్పడే మగవాళ్ళూ తయారవుతున్నారు గౌరవించి గౌరవం పుచ్చుకునే భర్తకి దాసీ కాదు— బానిస ఆడది. అటువంటి చోటున డబ్బు ప్రసక్తి రాదు

డి ఎన్ ఆర్   మిట్టపల్లి

ప్రేమించిన అమ్మాయి పెళ్లి చేసుకోకపోతే !

ప్రేమించు మళ్లీ— ఇంకో అమ్మాయిని!

టి ఎస్ ఆర్ యం   నాగులపల్లి

మన ప్రజలను మూర్ఖులంటావు.

మీ ఇష్టం కాని ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వం వారెలాంటి వారో చెప్పనే చెప్తుంది కదా—అంటాను.

యు యు   మిగనూరు

మనస్సు మధురమైన భావాలతో నింపుకుంటే జీవితం మధురమవుతుందా?

అవదు

ఎస్ ఆర్   ఖోటర్ (సౌది అరేబియా)

మీకు అబ్బాయిలులేరని విన్నాం. మాకు ముగ్గురు. మీకు అభ్యంతరం లేకపోతే—

భయపడకండి, ఇన్నాళ్లూ తెలుగుదేశపు పొలిమేర దాటితే తెలుగువాడు కాస్త విశాలంగా ఆలోచిస్తాడన్న నా భ్రమని తొలగించారు! అంతదూరం వెళ్లినా మీబుర్ర కొడుకులు— మనవళ్లు- డబ్బు— కోడళ్ల మీటిమీదే వుంది! లాభంలేదు ఇలా ఉత్తరాలు రాయడానికి తెరిపిదొరికినప్పుడు రామకోటి రాసుకోండి పుణ్యం పురుషార్థం! కొడుకులు లేని మేము పున్నామనరకం చచ్చాక చూస్తాను వున్న మీరు భూమ్మీదే చూస్తారు, వాళ్లకోసం కూడబెడుతూ

కె ఆర్.ఎల్   మిగనూరు

స్నేహానికి బంధుత్వానికి తేడా?

స్నేహానికి స్వేచ్ఛవుంది. బంధుత్వానికి లేదు!

జి ఆర్ కె   పాలకొల్లు

బాధలు ఎన్ని ఉన్నా, ముందు ముందు ఎన్ని కష్టాలు అధిగమించవలసి వున్నా రోజులు విచిత్రంగా గడిచి పోతూవున్నాయి. ఏ కారణం వలన?

ఆదే కాల మహిమ. జీవుల కష్ట సుఖాలతో వారి వేదనలతో కాలానికి పనిలేదు అది సాగిపోతూనే వుంటుంది

పి హెచ్ వి   సిరిసిల్ల

మానవుడి మనుగడకు అతి ముఖ్యమైనది ఏది?




జీవం. అది లోపిస్తే జీవచ్ఛవంలాగా, కదలేనుగ లాగా కూడా మానవుడు బ్రతికేయవచ్చును గాని మనిషి అనిపించుకోలేడు

ఏ ఎన్ ఆర్   అనంతపురం

నేనో అమ్మాయిని మనస్ఫూర్తిగా ప్రేమించాను మనిషిని కాదు మనస్సుని. ఆ నా హృదయం గాయపరిచింది

మనసాకరికీ మనిషి ఒకరికీ దత్తం కావడం ఇష్టం లేదేమో ఆ అమ్మాయికి! గుర్రాన్ని నీటి దగ్గరకి తీసుకెళ్ల గలమే గాని నీరు తాగించగలమా లేము! అలాగే బలవంతంగా ప్రేమింపచేయుటం సాధ్యం కాదు

జి ఎమ్ ఎస్   పెనుమండ

అన్నిటి కంటే వేగంగా పోయేది ఏది?

మనస్సు

వి కె ఆర్ వి   సికింద్రాబాదు

ఎదుటి వాళ్ళ నిజం చెప్పాలి తాము దాచిపెట్టు కుంటారు. వీరికేం చెప్పాలి?

నిజం చెప్ప కూడదని అనను ఎందుకంటే నిజం మంచి సూత్రమే. కాని అది మనకై మన పట్ల కూడా వర్తించేదిగా ఉండాలి

డి జె జె   హైదరాబాదు

స్నేహబంధం రక్త సంబంధం వీటిలో ఏది గొప్పది?

రెండూ గొప్పవే— వాటి పరిధులు దాటి ఎదుటి వారి వూపిరి పీల్చుకోడం దాకా— కంట్రోల్ చేయడం ప్రారంభించకుండా వుంటే

ఎమ్ డి.జె పి   ఆలంపూరు

రచయితలకు ఎత్తు అయిన ప్రదేశాలమీద నుంచి వూహలు కల్గుతాయంటారు. మరిమీరెక్కడ కూర్చుని వూహిస్తారు: రాస్తారు?

రాయడం ఏ మూల కూర్చునైనా— రాస్తాను టైము దొరికితే. ఇక వూహలు ఎప్పుడెలా వస్తాయని అడక్కండి. రాయడానికి ముందు యాసెల్లా మూసుకువచ్చు. అసలు రాకనూపోవచ్చు! [అందుకే కాబోలు నా రచనలు నేలబారుగ వుంటాయి రేపెద్దైన ఎత్తయిన ప్రదేశానికి వెళ్లి ఆలోచించి చూడాలి ]

బి జె ఆర్   సౌత్ మోపూరు

ఒక ఒరలో రెండు కత్తులు— ఒక కప్పుకింద రెండు కాపురాలు ఇమడ వంటారు

ఉట్టి కబుర్లు! రెండో కత్తి కొన్నవాడికి ఒర దొరకదా? రెండో కొంప దొరకదా? అబద్ధపు సామెతలలో ఇదొకటి!

ఆడదాని సంపాదన పై జీవించే వాడికి భార్య మీద ప్రేమ వుంటుంది:

సహృదయం కల దంపతులైతే— ఎవరు సంపాదించినా ఒకటే అనుకుంటారు తక్కువతనం ఫీలయ్యే మగవాడైతే మాటకి ముందూ— సంపాదిస్తున్నానన్న గర్వమా! అంటూ దెప్పుతూనే వుంటాడు— అందువల్ల— కుటుంబాలలో కలతలు రేగేది తనని కాకుండా తన సంపాదనే గౌరవించే వాడి మీద ఆడదానికి ప్రేమ ఎలా వుంటుంది..

ఆర్.ఎల్ - విశాఖపట్నం

ఈనాటికీ తన ఐశ్వర్యం ఏ జన్మ పుణ్యఫలమో అనుకున్న మానవునికి మరో జన్మలేదని బైబిల్ చెపుతూంది. ఏది నిజం:

బైబిల్ చెప్పక్కర లేదు. బాబాలు చెప్పక్కర లేదు ఈ జీవితం జాగ్రత్తగా బ్రతికేది సుఖంగా కన్ను మూయడమే నేటి మానవుని ధ్యేయం. ఇంకో జన్మ వుంటే ఎవడిక్కావాలి? లేకపోతే ఎవడిక్కావాలి?



# బొమ్మల మహాభారతం దుర్యోధనుని ప్రాయోపవేశం

మండపాక సీతారామాంజనేయులు






















[ఇంకా ఉంది]

# ఛాంపియన్ డిటర్జంట్ కేక్ !

# 1అప్

మరింత
తెల్లదనంతో
మీకు
విజయం!

మీకు
డబ్బులో
మరింత
ఆదా!






అధిక తీవ్రంగా పని
చేసే నురుగ, అధికంగా
తెలుపుచేసే పదార్థాలతో
శక్తి, దాంతోటే శుభ్రతతో
పాటు తెల్లదనాన్ని
యిస్తుంది మీకు వన్-అప్-
దాంతో తెల్లవాటికి మరింత
తెలుపు, రంగువాటికి
మరింత మెరుపూ వస్తుంది.



వన్-అప్, మరే యితర
డిటర్జంట్ కేక్ కన్నా
ఎక్కువకాలం మన్ను
తుంది. ఎందుకంటే,
వాడగానే తొందరగా అరి
పోతుంది గనక. అంటే
ఉతికే ప్రతిసారి మీరు
డబ్బును ఆదా
చేస్తున్నారన్నమాటే!




తెల్లదనానికి మీ పాలిట ఛాంపియన్!

ASP/WL-IUP 2R

విట్కో లిమిటెడ్, కాలోల్ 389 330 గుజరాత్.

# నళిని

## చిట్టారెడ్డి సూర్యకుమారి

(గత సంచిక తరువాయి)

బస్సు దిగి జట్కా ఎక్కి క్రొత్తపేట దారి పట్టారు. కొండ కెదురుగా సాగిపోతున్నది ఎండి. కాళ్ళు క్రిందకు వాల్చి రోడ్డు వైపు చూస్తున్నారు. గతుకుల దారిలో బండి వూపుకు అటు ఇటు వూగుతూ, తలలు కొట్టుకుంటుంటే నవ్వుతూ ఆనందిస్తున్నారు. బాట మలుపు తిరిగి కొండ ప్రక్కకు తప్పుకుంది.

కంటికి పచ్చదనం కరువైంది. అక్కడక్కడ ఎర్రని దుమ్ములో, పొట్టిగా, విచ్చుకున్న ఈకల పచ్చల్లా వున్న ఈతచెట్లు ఆ రాళ్ళ ప్రదేశానికి ఓ ప్రత్యేకమైన అందాన్నిస్తున్నాయి.

గ్రామంలోకి వచ్చింది బండి. యథాతథంగా అన్ని గ్రామాల్లోవలె ఇక్కడకూడా ఒకరి భుజాలు మరొకరు తాకుతున్నట్టుగా, మధ్య ఏమాత్రం ఖాళీ లేక ప్రక్క ప్రక్కనే వున్నాయి తృణ కుటీరాలు. 'మేమూ వున్నామంటూ' ఎత్తుగా లేచిన సంపన్నుల మేడలు తమ ఉనికిని తెలియజేస్తున్నాయి

ముంగిళ్ళు కళ్ళాపు జల్లి ముగ్గులు పెట్టి వున్నాయి. జండామాను అరుగుమీద బాటసారులు, క్రింద భిక్షకులున్నారు. అక్కడక్కడ వేప, చింతచెట్లు తప్ప, ఇంటి ముంగిట పూలమొక్కలు లేవు. ఇండ్ల పైకప్పుల వరకు అల్లుకున్న సొర, బీర పాదులు ఎండిపోయి వున్నాయి. అక్కడక్కడ వాటి తాలూకు విత్తనాల కాయలు అగుపిస్తున్నాయి. మేక, గొర్రె పిల్లల అరుపులు వినవస్తున్నాయి. గోధూళి వేళకొరకు ఎదురుచూస్తూ ప్రాంగణంలో అల్లరిపిల్లల్లా గెంతుతున్నాయి లేగదూడలు. రేడియో సంగీతం బాటమీదకు వినవస్తున్నది. ఆ గ్రామానికి కాస్త ఎడంగా ఓ విశాలమైన యింటి ముందు జట్కా ఆగింది.

అడ్డంగావున్న చువ్వను తీసి క్రిందికి దూకారిద్దరు

గేటులేని ప్రహరీలో అడుగుపెడుతూ, రేగిన జుట్టును సరిచేసుకుంటూ వెళ్ళారు. ప్రహరీ నుండి ద్వారం వరకు సిమెంటు నేల గోడ కానుకుని నీళ్ళతొట్టి వుంది. దాహం తీర్చుకుంటున్న జోడెద్దులు మెడలు పైకెత్తాయి. వాటి మెడనున్న తొడుగులు శబ్దంచేశాయి.

వసారాకి పెద్ద ఆర్చీలున్నాయి. మధ్య ఆర్చీ గుండా లోపలికి దారి. ఇరుప్రక్కలా ఎత్తుగా పొడుగాటి బల్లపరపుగా సిమెంటు దిమ్మెలు. ఓ మూల పరుపులు చుట్టివున్నాయి.

లోపలికి వెళ్ళడానికి కాస్త తటపటాయించింది నళిని 'దయచేయండ'oటూ చేయి పట్టి లాక్కెళ్ళింది వాసవి ముందు గది వరండా అంత పొడుగ్గా వుంది. ఖాళీగా వుంది. గోడల అంచుల చుట్టూ ఎరుపు, తెలుపు గీతలున్నాయి ద్వార బంధానికి పసుపుపూసి వుంది. రెండో గదిలోకి వచ్చారు. వసారాలా వున్న ఆ గది రెండు భాగాలుగా వుంది ఇందులో ధాన్యపు బస్తాలు పైకప్పు అందుకుంటున్నాయి

మూడో ద్వారం దాటారు కవలల్లా వున్న రెండు గదులకు తాళాలు బిగించివున్నాయి. ప్రశ్నార్థకంగా చూసింది నళిని. 'ఒకటి స్టోర్ రూమ్. మరొకటి ఇత్తడి, వెండి మొదలగు సామాగ్రి వున్న గది'. సందేహనివృత్తి చేసిందివాసవి.

మరో హాలులోనికి వచ్చారు. అందులో నేలకి అమర్చిన రోలు, తిరుగలీ వున్నాయి. పప్పుదినుసులు, ధాన్యాలు ఆ గదిలో శుభ్రపరచుకుంటారు అక్కడికి వెనుకవైపున్న వారి పరిసరాలు చల్లని గాలులు మోసుకొస్తున్నాయి

మిద్దె వెనుక వసారాకు పూరిల్లు అతికించబడ్డుంది. వసారా నుండి పూరింటికి సన్నని సిమెంటు బాట వుంది. బాటమీదుగా వెళ్ళితే ఓ ప్రక్క వంట గది. ప్రహరీగోడ సందులో నీటి తొట్టి ప్రక్కన పెద్ద బుట్టలో శుభ్రపరచి పెట్టిన పాత్రలున్నాయి. వంట గది ముందు మబ్బుడుపాత్రం వగైరాలున్నాయి. ప్రహరీకి మరోప్రక్క వరుసగా నాలుగు గదులున్నాయి మూడు గదుల్లో ఆ ఇంటి కోడళ్ళుంటారు. విశాలమైన హాలుకు తడిక అడ్డంగా వుండి, వంట గదిగాను, డైనింగ్ హాలుగాను విభజించింది డైనింగ్ హాల్లో చిన్న చిన్న టేబిల్స్, కుర్చీలు వున్నాయి

వంట గదిలో అమ్మగారు ఇద్దరు కోడళ్ళు వంట ప్రయత్నంలో వున్నారు. అవసరార్థం పని మనిషి వంట గది బయట నిల్చునివున్నది

ఆ ఇంటి యజమాని, ముగ్గురు కొడుకులు తమ తమ పనులమీద బయటకు వెళ్ళారు.

వంట గది బయట చెప్పులొదిలారు నళిని, వాసవీలు. పనుల్లో నిమగ్నులై వీరి రాకను గుర్తించని అమ్మ, వదినెలు ఒక్కసారిగా వారి వైపు చూశారు వాసవి వారిని చిరునవ్వుతో పలకరించింది. పని మనిషి చెంబుతో నీళ్ళు అందించింది. వాసవి అందుకుని నళిని కిచ్చింది వదిన లిద్దరు బయటకు వచ్చారు ''పెద్దవదిన — చిన్నవదిన'' అంటూ నళినికి పరిచయం చేసింది.

పొయ్యి దగ్గర నుండి కళ్ళొత్తుకుంటూ వచ్చింది శకుంతలమ్మ. ఎర్రగా, పొట్టిగా, సన్నగా ముతక చీరలో వుంది చెంపలకు పచ్చగా పసుపు పూత, కుంకుమబొట్టు, చేతులకు నిండుగా బంగారు, మట్టిగాజులు కలిపి వేసుకున్నది. నవరంపెట్టి గట్టిగా వేసిన చుట్ట. చీరె కుచ్చెళ్ళు బొడ్లో దోపుకున్నది. ఆమె కళ్ళు, ముక్కు వాసవిని గుర్తుకు తెస్తాయి

''నళినీ! బాగున్నావా? ఎంత ఎదిగిపోయావు పరికిణీలు కట్టంగ చూశాను.'' నవ్వుతూ పలకరించింది శకుంతలమ్మ.

''వాసవి ఎదగలేదా?'' నవ్వుతూ కొంటెగా ఎదురు ప్రశ్న వేసింది నళిని.

''చూడక, చూడక చూస్తే అలాగే వుంటుంది. ఇంట్లో అందర్నూ కులాసాయేనా? అందరూ హైదరాబాదుకు చేరుకున్నారటగా! మరి పొలాలు ఎవరు చూస్తున్నారు?''

''చాలావరకు అమ్మేశారు బావకు ట్రాన్స్‌ఫర్ అయి హైదరాబాదు వచ్చారు అందరు ఒకేచోట వుండొచ్చని అభిప్రాయపడ్డారు''

''ఉమ్మడి కుటుంబమా?''

''కాదు. అక్కావాళ్ళకు క్వార్టర్స్ వుంటాయి.''

''బావకు మిలటరీ ఉద్యోగం కదూ?''

తలూపింది నళిని. ఒకప్రక్క నిల్చున్న కోడళ్ళిద్దరూ కన్నార్పకుండ నళినిని చూస్తున్నారు.

వారు పొడుగ్గా, సన్నగా, మంచి ఛాయ కలిగి వున్నారు. పెద్దకోడలికి ముప్పైరెండు సంవత్సరాలుంటాయి. తలంటుకుని, కురులను వదులుగా ముడేసుకుంది. సన్నని పొడుగాటి ముక్కు, చిన్న కళ్ళు, సన్నని పెదాలు సగం బుగ్గల్ని ఆక్రమించుకున్నాయి.

చిన్నకోడలి జడ పిరుదులను తాకుతున్నది విశాలమైన నుదురు కనుబొప్పులు వుబ్బివున్నాయి పొట్టి ముక్కు. అయినా అందంగానే వుంది వారి వయస్సే వుంటుంది

''స్నానంచేసి వస్తారా! అన్నం వడ్డిస్తాను'' అమ్మ అంది.

''చిన్నవదిన ఏది?'' నళిని నెయ్యి పట్టుకుని టేబిల్ దగ్గరకు వెళ్ళుతూ తల్లిని ప్రశ్నించింది.

''పుట్టింటికి వెళ్ళింది. రేపోమాపోరావచ్చు.''

''ఏమిటి విశేషం వదినా?'' అనుసరిస్తున్న వదినను అడిగింది

''నీకు తెలియదా? మూడోనెల.''

''మీరు వ్రాస్తేకదా తెలిసేది వదినా! స్నానంచేసే బయలుదేరాం! అన్నం వడ్డించెయ్!'' విస్తరి నళిని ముందుకు జరుపుతూ అన్నది వాసవి.

పెద్దవదిన సరస్వతి కూరలు వడ్డించింది. చిన్నవదిన వేడి అన్నం పెట్టి కమ్మని నెయ్యి వేసింది గడ్డపెరుగుతో ఇంటి భోజనం కమ్మగా, సంతృప్తిగా తిన్నారిద్దరూ.

అంతలో పెద్దబ్బాయి గోవిందు వచ్చాడు.

''వచ్చారా హంసడిభకులు.'' పరిహాసమాడాడు.

పెద్దన్నయ్యతో నళినికి బాగా పరిచయము వున్నందునే కుశలప్రశ్నలు వేశాడు.

''ప్రయాణం బాగా జరిగిందా? పరీక్షలు

---

**జరిగిన కథ-1:** తమ కాలేజీ చదువు ముగించుకొని బయటపడ్డారు వాసవి, నళినిలు. తరువాత వాసవితో కలిసి వాళ్లవూరు వెళ్ళింది నళిని.

---

బాగా వ్రాసారా? క్లాసు వస్తుందా? క్లాసు వచ్చినవాళ్ళకే సీటు దొరకడం కష్టంగా వుంది. అంత కాంపిటీషన్ వుందిప్పుడు.'' ఇత్యాది ప్రశ్నలవర్షం కురిపిస్తూ – విస్తరిమీద నీళ్ళు చల్లుకుని ''అమ్మా'' అని పిలిచాడు.

శకుంతలమ్మ అన్నం ఒడ్డిస్తూ ''చెల్లికి పెళ్ళి చేయవా? ఇంకా చదవమంటావా?'' అన్నది.

పెద్దకోడలు కూరల గిన్నెలు తెచ్చి బల్లమీద పెట్టింది.

సహజముగా గోవిందు రంగు తెలుపు. కాని పొలంలో ఎండకు కష్టించి పని చేయడంవల్ల కాస్త నల్లబడ్డాడు. నల్లటి ఒత్తైన జుట్టు, దృఢమైన శరీరం. ఖద్దరు చొక్కా, పంచెలో వున్నాడు. ముఖం శరీరమంత గంభీరంగా లేదు. చిరునవ్వు పెదవులపై తాండవిస్తూ, చూడటానికి పాతికేళ్ళ కుర్రాడిలా అగుపిస్తాడు. భార్య కంటె చిన్నవాడిలా వున్నాడు. ఇద్దరి వయస్సులో కాస్త తేడా వుండవచ్చు. అయితే కలిసొచ్చిన సంబంధం వస్తే ఆడపిల్ల వయస్సు కాస్త తగ్గించి చెబుతారు. నళిని అనుకున్నది.

''చేద్దాం! కానీ ఆ ఫారెస్ట్ ఆఫీసర్‌గారికి ఈ బి. ఏ. సరిపోతుందా? కనీసం ఎం. ఏ. కావాలంటాడేమో.'' సందేహం వెలిబుచ్చాడు.

''ఆ ఎం. ఏ. లతో ఏం చేస్తాడట.''

''ఎం. ఏ. పెళ్ళాం అన్నం వండితేగాని దిగుడుపడదేమొ?''

వాసవిని జూసి నవ్వింది వదిన.

కోపం నటిస్తూ నళిని చెయ్యి పట్టుకుని బయటకు వస్తుంటే తండ్రి ఎదురుగా వచ్చాడు.

''అరెరె ... హంసడిభకులు వచ్చారే! సంతోషం! భోజనం అయ్యిందా?''

''ఇప్పుడే ముగించాము.''

''పరీక్షలు బాగా వ్రాశారా?''

''ఆс...''

''అలసిపోయినట్టున్నారు. కాస్త రెస్ట్ తీసుకోండి'' అంటూ వంట గదిలోకి వెళ్ళాడు.

పెద్దకొడుకు లిద్దరి చదువు హైస్కూలు దాటలేదు. చిన్నవాడు మాత్రం ఎలాగో ఇంటర్ వరకు వచ్చి మరి ముందుకు పోనసి మొరాయించాడు. అందరికి పెళ్ళిళ్ళు చేసి పొలంపను లప్పగించాడు. తాను పంచాయితీ ప్రెసిడెంట్ కాబట్టి, రాజకీయాలలో తిరుగుతూ, పై పనులతో 'బిజీ'గా వుంటాడు.

మనిషి అంత ఎత్తు, లావు కాక మధ్యస్తంగా వున్నా బొజ్జ మాత్రం పైకి తన్నుకొచ్చింది అది బొజ్జ కాదు, తృప్తి అంటాడు.

మామగారిని తప్పుకుని చిన్నకోడలు, నళిని వాసవీల వెనుక నడుస్తూ ''మిమ్మల్నందరూ హంసడిభకులంటారేం?'' అమాయకంగా అడిగింది.

నళిని, వాసవీలు పకపక నవ్వారు.

''అది మా ముద్దు పేరు వదినా! నిన్ను మీ యింట్లో 'చంటి' అని పిలవడంలేదూ? అలాగే...'' అంది వాసవి.

''పూర్వం హంసడిభకులనే రాజకుమారు లుండేవారు. వారు అత్యంత అప్తమిత్రులు. వారిద్దరు జరాసంధునకు మిత్రులు. పలుమార్లు మధురా నగరంపై దండెత్తుతూ శ్రీకృష్ణుని విసిగించేవారు. రణరంగంలో వారి నోడించుట కష్టతరముగానుండ శ్రీకృష్ణుడు యుక్తిపన్నాడు. హంసుడు మరణించాడని పుకారు పుట్టించాడు. అది విని 'హంసుడు లేని లోకంలో నేనుండలేన'ని నదిలో మునిగి ప్రాణం వదిలాడు డిభకుడు డిభకుని చావు వార్త విన్నవెంటనే ఆత్మాహుతి చేసుకున్నాడు హంసుడు. హంసడిభకుల మైత్రి



# కట్నపిశాచానికి మరో అబల బలి!

**అర్నెల్ల గర్భవతి** శశిబాల హత్య చెయ్యబడిందా? లేక ఆత్మహత్యకు పాల్పడ్డదా? అన్న విషయంపై ఢిల్లీ పోలీసులు చేస్తున్న దర్యాప్తు యింకా కొనసాగుతూనే ఉంది.

తన కుమార్తెని ఆమె భర్త, అతని తరపువారు కట్నం కోసం హత్య చేశారని శ్రీమతి బాధా పోలీసులకి చేసిన ఫిర్యాదులో పేర్కొన్నది.

24 ఏళ్ల శశిబాల ఢిల్లీ విశ్వవిద్యాలయం పట్టభద్రురాలు. గత సంవత్సరం మేలో ఒక సంస్థ మేనేజరు శ్రీ ఎస్. భసిన్‌తో ఆమె వివాహం జరిగింది. మొన్న మార్చి 17న అత్తవారింటిలో ఆమె చనిపోయింది. కాలిన గాయాలు ఆమె మరణానికి కారణమని శవపరీక్ష తేల్చింది.

తాము పేదరికంలో ఉన్నా అప్పుచేసి అల్లుడికి ఫ్రిజ్ కొనిపెట్టామని, టెలివిజన్, స్కూటర్‌లు యివ్వడానికి ఏర్పాటు చేశామని, కానీ అల్లుడి కోరికలు అంతకంతకూ పెరుగుతూనే ఉన్నాయని, తగినంత కట్నం తేలేదని తన కూతుర్ని వాళ్లు బాధపెట్టేవారని పుట్టెడు దుఃఖంలో ఉన్న ఆ తల్లి మొత్తుకుంది.

శశి చనిపోవడానికి రెండు రోజుల ముందు పుట్టింటికి తిరిగివచ్చిందని, తనని వాళ్లు చాలా హీనంగా చూస్తున్నారనీ తిరిగి అక్కడికి వెళ్లనని అన్నదట.

చనిపోయిన తన కుమార్తెని ఎవరూ తిరిగి తీసుకురాలేరని, కానీ ఈ దేశంలోని ఎంతో మంది విద్యావతులైన అమ్మాయిలకు యికముందు యిలాంటి గతి పట్టకూడదని ఆమె అన్నది. కట్నంమీది వెర్రి వ్యామోహం తన కూతురి జీవితాన్ని బలిగొన్నది. దేశంలో యిలాంటివారు వేనకువేలు ఉన్నారనికూడా ఆమె వాపోయింది.

స్థానిక పోలీసులు ఈ కేసు విషయంలో శ్రద్ధ చూపనందున ప్రధాని, హోంమంత్రి, కొందరు ఎం. పి. లని కల్సుకుని శ్రీమతి బాధా

శ్రీమతి శశిబాల



తన గోడుని వినిపించింది. ఇలా కాళ్లకు బలపాలు కట్టుకుని తిరగ్గా తిరగ్గా యిప్పుడా కేసుని క్రైం బ్రాంచికి బదలాయించారు.

—(హిందుస్తాన్ టైమ్స్ వార్త ఆధారంగా)

## నళిని

అంతటి గాఢమైనది. బాల్యం నుండి మేము అలా మెలగడంవల్ల అన్నయ్య మాకిచ్చిన పేర్లవి." నళిని వివరించింది.

వారి స్నేహాన్ని జూస్తే ఆ క్షణంలో ఈర్ష్య కలిగింది. తనకూ అలాంటి స్నేహితులు వుంటే! వాళ్ళవలె తాను చదువుకునివుంటే! స్కూలుకు కాలేజికి వెళ్ళాలనే ఆశ వుండేది శారదకు. ఫ్యాషన్‌గా అలంకరించుకుని, ఫ్రీగా వుండాలనుకునేది. కాని ఏడో క్లాసుతోనే చదువుకు స్వస్తి చెప్పించారు తల్లిదండ్రులు.

"మీది అలాంటి స్నేహమంటారు ?" నమ్మలేనట్టు అడిగింది.

"అనుమానమా ?" అన్నట్టుగా చూసింది వదినకేసి వాసవి.

చెక్క మెట్లపై ఎక్కి డాబామీదకు వెళ్ళారు. పొడుగాటి మిద్దెమీద తృణ కుటీరముంది. దాని ముంగిట చిన్న పందిరి. పందిరి నల్లుకుని మనీ ప్లాంట్ పచ్చతోరణంలా వుంది. ఇరువైపులా పూలమొక్కల కుండీలున్నాయి. వెదురు తట్టలలో పుదినా, దవనం గుంపుగా పెరిగి నవనవలాడుతున్నాయి. క్రోటన్, గులాబి మొక్కలు ముద్దుగా వున్నాయి. కంటికింపైన ఆ వాతావరణం మనస్సు కాహ్లాదం కలిగిస్తూ సేదదీరుస్తాయి. ఆ పరిసరాలను చూస్తూ ఆశ్చర్యంతో అలాగే కాసేపు నిలబడింది నళిని.

"వాసవీ! వండర్‌ఫుల్! యిక్కడి వాతావరణం ఎంత బాగుంది! మూన్ లైట్‌లో ఇంకా బ్రహ్మాండంగా వుంటుంది."

"అంత బాగుందా ?"

"నీకు బాగలేదా ?"

"అని నేనన్నానా ?"

"పొగరుబోతూ !"

"పోవే పోట్లగిత్తా !" చిరుకోపం ప్రదర్శించింది వాసవి.

"కమాన్ !" లోపలికి చేయి పట్టుకుని పిలుచుకు వచ్చింది.

కుటీరంలో రెండు మంచాలు, చిన్న టేబిల్, కుర్చి, ఒక చిన్న పుస్తకాల గ్రెడెజ్ ర్యాక్, అందులో కొన్ని నవల్స్, వీక్లీల్లో వచ్చిన సీరియల్స్ బైండింగ్స్, కొన్ని మ్యాగజైన్స్, మరికొన్ని పుస్తకాలు నీట్‌గా, పొందికగ అమర్చబడి వున్నాయి.

మంచముపై బూరుగుదూది పరుపుమీద వాలింది నళిని. ఆ పరిసరాలు మనసుకు, శరీరానికెంతో ఆహ్లాదాన్ని కలిగిస్తున్నది.

ప్రక్కనే పడుకుంటూ "ఇది శివన్నయ్య పనితనం." చెప్పింది వాసవి

"భార్య నాకర్షించుకోవడానికి పడుతున్న ప్రయాస." నవ్వుతూ అన్నది.

"పెద్దవదిన చిన్నాయన కూతురు చిన్నవదిన. ఇంటి మంచితనాన్ని చూసి శివన్నయ్యకు యిచ్చారు. పెళ్ళితో హైస్కూలు చదువుకు స్వస్తి పలికింది. అయినా తానెంతో చదువుకున్న దానివలె ప్రవర్తిస్తుంది. ఇతరులను చదువురాని వాళ్లక్రింద జమకడుతుంది. చాలావరకు పుట్టినింట్లో వుండాలనే ప్రయత్నిస్తుంది."

అంతలో శారద వాకిట సామాన అక్కడ పెట్టించి నిలబడింది

"కూర్చో వదినా" అంటూ జరిగి చోటు ఇచ్చింది వాసవి.

"చిన్నన్నయ్య ఇంకా రాలేదా ? ఎక్కడికెళ్ళాడు ?"

"పొలం వెళ్ళాడు." బదులు పలికింది శారద.

"ఈ కాలంలో పొలంలో ఏం పని ?"

"వేరుశెనగ వేస్తారు. కరెంటు బావుల క్రింద పొలాలకి ఎప్పుడూ తీరిక వుండదు. ఒకదాని తరువాత మరొకటి వేస్తుంటారు."

"నీవు ఇంకా భోంచేయలేదుకదూ! వెళ్ళు వదినా !"

"ఆయన రానీగ !"

"ఏం ? ఆయన రాకుండా భోజనము చేయకూడదా ?"

"పల్లెల్లో అంతేమరి." శారద నవ్వుతూ అన్నది.

వారు మాట్లాడుకుంటుండగానె చిన్నన్న రాము "వాసవీ" అంటూ వచ్చాడు.

"అబ్బో! నళిని కూడా వచ్చిందే ఈ పల్లెటూరికి! బాగా ఎదిగిపోయారు!" నఖశిఖ పర్యంతం చూస్తూ పలికాడు

ప్రక్కన నిల్చున్న శారద ఎత్తుకు సమానంగా, సన్నగా వున్నాడు ఎప్పుడూ సంతోషంగా వున్నట్టుండే ముఖం. ఏమాత్రం మారలేదు.

"ఇంకా నాటకాలు, అవీ వేస్తున్నావా ?" నళిని ప్రశ్నించింది.

"పుట్టుకతో వచ్చిన బుద్ధి! అంత సులభంగా పోతుందా చెల్లమ్మా! ఈసారి జాతరకి శ్రీకృష్ణతులాభారం వేస్తున్నాం"

"అయ్యబాబోయ్! 'తల భారం' కాదు కదా!" హాస్యమాడింది నళిని.

"అలాగంటావేం చెల్లమ్మా! రేపు డ్రామా వ్యాసేటప్పుడు 'వన్స్‌మోర్'లు కొట్టకుండా వుండలేవు! తెలుసా!"

"అలాగా? అయితే నీది ఏ వేషం?"

"కర్ణుడు." మీసం మెలేస్తూ కర్ణుని ఫోజు పెట్టాడు.

భారతంలో కర్ణుడి దెంత విషాదమైన గాథో? అంతటి ఉదాత్తమైన చరిత కూడా! కన్నతల్లి మొదలు, రథసారథి వరకు అందరూ మోసగిస్తారు. ఓర్పులో స్త్రీని మించిపోయాడు. చివరకు గురువు అనుగ్రహం కూడా కరువైపోగా, ఆగ్రహానికి గురియై శపించబడతాడు. కీటకం తన తొడ తొలచి బాధపెడుతున్నా, రక్తం ధారావాహినిగా కారుతున్నా, తన ఒడిలో నిద్రిస్తున్న గురువుకు నిద్రాభంగమవుతుందని, బాధను సహిస్తూ ఓర్చుకుంటాడు; గురుభక్తిని ప్రదర్శిస్తాడు. భక్తికి మెచ్చి ప్రేమ, మక్కువ జూపవలసిన పరశురాముడు గుణాన్ని గ్రహించక కులాన్ని మాత్రమే చూసి నిర్దయగ శపించి కర్ణుని ముందు అల్పుడే అయినాడు.

రాములో కర్ణున్ని ఊహించుకుంటూ "ది గ్రేట్ కర్ణ! ఐ లవ్ హిమ్" అన్నది నళిని.

* * *

దీపాలు వెలిగే వేళకు పనులన్నీ ముగించుకుని మంచాలెక్కేస్తారు గ్రామీణులు. గ్రామం నిశ్శబ్దంగా వుంది. ఆ నిశ్శబ్ద నిశీధిలో నిర్మలాకాశం అలలులేని సముద్రంవలె ప్రశాంతంగా, మరీ దగ్గరగా వున్నట్టు అగుపిస్తున్నది. ఆలుచిప్పలు విచ్చుకుని అందులోని ఆణిముత్యాలు బయటకు వచ్చినట్లు ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి

"ఇన్ని నక్షత్రాలను నేనెన్నడూ చూడలేదు. నిత్యము పాలు నెయ్యి తిన్న మనిషిలా చంద్రుడు నవనవలాడుతున్నాడు." మంచంపై వెల్లకిలా పడుకుని ఆకాశంకేసి చూస్తూ పలికింది నళిని.

"పట్నాల్లో లైట్ల వెలుగులో, దుమ్ము ధూళి పొగలలో నక్షత్రాలు సరిగా కనిపించవు. కదూ! పల్లెసీమల్లో శర్వరీ శర్వాణిలా వుంది కదూ!"

"నళినీ! కవిత్వం వస్తున్నట్టుందే?" వాసవి నవ్వుతూ పలికింది.

నవ్వుతున్న వాసవి ముఖం చల్లని చందమామ వెలుగులో తెల్లగా మెరిసిపోతున్నది. సూర్యుని వెలుతురు చంద్రుడు గ్రహించి ప్రకాశిస్తున్నట్టు, చంద్రుని చల్లదనాన్ని, తెల్లదనాన్ని వాసవి గ్రహించి ప్రకాశిస్తున్నట్టు మెరిసిపోతున్నది నళిని చిరునవ్వుతో రాగంతీసింది.

"ఫుల్ మూన్ లైటటా!
జాస్మిన్ బ్రైటటా!
మూన్ కన్న,
మల్లెకన్న,
నీదు మోము బ్రైటటా!
ట ... ట ... ట."

"వండర్‌ఫుల్! ఆశుకవిత్వం చెప్తున్నారే అమ్మాయిగారు!"

"పిచ్చి వాసవీ! ఇది నా స్వంత కవిత్వం కాదు."

"మరి."

"దేశమంటే మట్టికాదోయ్!" అన్నవాడిది.

"ఐసీ! కంఠతబెట్టి, ఏకంగా వల్లిస్తున్నా వన్నమాట!"

"చిత్తం చెలీ! గ్రహించితివిగదా! మీకిదే ధన్యవాదములు!" చేతులు జోడించి అభినయించింది నళిని.

ఆ తర్వాత చల్లనిరేయిలోని ఆనందాన్ని అనుభవిస్తూ ఎప్పుడు కన్నుమూశారో వారికే తెలియదు.

పడకంతా మంచుకు చల్లబడింది. ఆ చల్ల దనానికి మేలుకున్న నళిని వాసవికేసి చూసింది. అర్ధచంద్రాకారంగా ముడుచుకుని పండుకున్నది.

కాళ్ళ దగ్గరి దుప్పటి కప్పుకోవడానికి కూడా బద్ధకం! అనుకుంటూ వాసవిపై బెడ్‌షీట్ కప్పింది.

వేకువఝామును తానెప్పుడూ పరీక్షగా చూడలేదు. తూర్పు వాకిలి తెరచినట్లు తెల్లగా వున్నది. నిషా కన్య మత్తులోనుండి ప్రకృతి ఇంకా కోలుకోలేదు. చీకటి పొరలు పొరలుగా విడిపోతు న్నట్టు ఘడియ ఘడియకు తెల్లబడుతుంటే, ఆహారాన్వేషణకు తొందరపడుతూ, సూర్య దర్శనం కోసం స్తోత్ర పాఠాలు వల్లించే ముని జన సందోహంలా పక్షుల కిలకిలా రావములు వినిపిస్తు న్నాయి. కోడిపుంజులు సుప్రభాతానికి తమ కూతలతో స్వాగతం పలుకుతున్నాయి. కోడికూత లతో మేలుకున్న నళిని ఒళ్ళు విరుచుకుని లేచి కూర్చుంటూ మందహాసం చేసింది. పూర్వం అహల్య పొందుగోరి వచ్చి గౌతముని పర్ణశాల ముందు నిల్చుని కోడిపుంజువలె గొంతుచించుకు అరచిన ఇంద్రుడు జ్ఞాపకం వచ్చాడు.

## వెలుగుకోసం

చీకటి బరితెగించి
బాకులు చూపి రాజ్యమేలుతున్నపుడు,
ఓర్పు నెత్తురులో నైరాశ్యం
నృత్యం చేస్తున్నపుడు
శవాలు లేచొస్తాయి.
విచ్చుకత్తులను ఓడించే రెచ్చిన ఉగ్రాలతో,
గొంతుల్లో గర్జనలతో,
కళ్లలో కత్తులతో
మెదళ్లలో మెఱుపులతో
పైబడతాయి!
చీకటి గుండెల్ని చీలుస్తాయి
కొంగ్రొత్త వెలుగులకు ఊపిరిపోస్తాయి

— యాచన బాలకృష్ణ

క్రొంజిగురుల కోసం వచ్చిన కోయిలలు సంగీత గానం చేసే యత్నాల్లా కూస్తున్నాయి. అంతలో బ్రహ్మాత్మకుడైన సూర్యుడు అగ్నిలో నుంచి ఉద్భవించినట్లు పైకి వచ్చాడు.

నళిని తృప్తిగా నిట్టూర్చి ప్రక్కకు తిరిగింది. తనవంకే చూస్తున్న వాసవిని చూసి "ఏయ్ దొంగా! మేల్కొనే వున్నావా?" అంది.

"జిజ్ఞాసగా చూస్తున్న నీ మోమును చూస్తుంటే, సూర్యోదయానికి విచ్చుకుంటున్న కమలం గుర్తుకు వస్తున్నది. ఉషస్సులా ఎంత అందంగా వున్నావో తెలుసా? రియల్లీ యూ ఆర్ వెరీ బ్యూటిఫుల్ నళినీ!"

"ఏమిటీ విడ్డూరం? సైన్స్ పిల్లకు కవిత్వం వస్తున్నది. వెనుకటి శ్రీకృష్ణదేవరాయల కాలం గుర్తుకు తెప్పిస్తున్నావు నీ కవిత్వంతో! భోజుని కాలంలో పశుకాపరులు సైతం ఆశు కవిత్వం చెప్పేవారట. అలాగే ఇప్పుడు కూడా ఇంటికో రచయిత్రి వెలసి పూర్వపు రాజుల కాలాన్ని గుర్తుకు తెప్పిస్తున్నదంటే అతిశయోక్తి కాదేమో!" నళిని చిన్న లెక్చర్ దంచింది.

ఇద్దరూ కాసేపు డాబా మీద పచార్లు చేశారు.

ఆ తరువాత ప్రాతఃకాలకృత్యాలను ముగించి, టిఫిన్ తిని మళ్ళీ డాబా మీదికి వచ్చారు. తరువాత ఏం చేయాలో తోచలేదు. పరీక్షలు, చదువు అయిపోయేటప్పటికి ప్రపంచంలోని తీరిక అంతా వారి ముందే వున్నట్లనిపించింది ఏమీ పాలుబోక పొలాలవెంట పోదాం అనుకున్నారు.

గుమ్మడికాయలంత సంగటి ముద్దల ఎద్ది మూటతో పొలానికి వెళ్ళుతున్న పాలేరు వెంట బయలుదేరారిద్దరూ. చీరె కుచ్చెళ్ళు ఎత్తిపట్టుకుని పొలం గట్ల వెంట నడుస్తూ, అలసట తీరేందుకు చెట్ల నీడన మజిలీలు వేస్తున్నారు. పొలం గట్లపై చుట్టూ వివిధ రకాల చెట్లున్నాయి. కొన్నిటికి ఆకులులేక బోసిపోయిన రెమ్మలతో నిల్చున్నాయి. వాటి ఆకులు త్రుంచి పొలానికి ఎరువుగా వేసేవట్లు చెప్పాడు పాలేరు.

దున్నిన పొలంపై గుంటక పాస్తున్నారు ఒకప్రక్క. పొలంలో కాడి వెంట రాము, చిన్నన్నయ్య నడుస్తూ నడుంకు కట్టుకున్న విత్తనాలు తీసి జడిగంలో వదులుతున్నాడు. రెండు గుర్రాళ్ళు ఒకదాని వెనుక మరొకటి లయబద్ధంగా ముందుకు, వెనక్కు కదులు తున్నట్టున్నాయి.

"చిన్నయ్య విత్తనం వేస్తుంటే చూడటానికి రెండు కళ్ళు చాలవు" అన్నాడు పని పిల్లవాడు.

"అవును! ఆ నేర్పు చూసే, మెచ్చి తన కూతుర్ని కట్టబెట్టాడు చిన్నమామగారు." అతిశయంగా పలికింది వాసవి.

తరువాత పొలం ప్రక్కన బావి దగ్గర నీళ్ళల్లో ఆడారు. ఆవైపున నిండుకంకితో, ఏపుగా పెరిగి వంగిన జొన్న పొలంలోకి వెళ్ళి మంచె ఎక్కి కూర్చున్నారు పిచ్చుక పిల్లల కువకువ ధ్వనులు సంగీతస్వరాల్లా వింటూ మైమరచింది నళిని. గింజలతో నిండుగా వున్న కంకులు పిట్టలను ఆహ్వానిస్తున్నట్టు చిరుగాలికి

## నళిని

అటు యిటు కదులుతున్నాయి. ఏపుగా పెరిగిన చేనులో – మసక చీకటిలో – మంచెకాడ మామను కలుసుకోమన్న ఎంకి తలంపుకు వచ్చి – "వాసవీ! నీవు బావను యిక్కడ కలుసుకుంటే యెలా వుంటుంది ?"

వాసవి ఉలిక్కిపడింది. తన మనసులోని భావాన్ని నళిని ఎలా చదవగలిగిందా అని!

"నళినీ! నేను బావతో, నీవు మీవారితో కలిసి ఈ ప్రదేశాలన్ని తిరిగితే ఆ అనుభూతి ఎలా వుంటుందో ?"

"అలులేదు చూలన్న సామెతను గుర్తుకు తెస్తున్నది నీ మాట. మావారెవరే ?" కన్ను లెగరేస్తూ పలికింది.

"నాకేం తెలుసు ? పెళ్ళి – పెళ్ళని మరీ మరీ వాగేస్తున్నావు గనుక నీ మదనసుందరుని గురించి నీవే చెప్పాలి."

"బాగుంది నీ వరస! నేనింకా వరాన్వేషణ మొదలెట్టలేదు. ఆ సుందర విగ్రహాన్ని వర్ణించ మంటున్నావు."

"పోనీ! ఎలాంటివాడు కావాలో చెప్పు."

"ఏం ? ఎక్కడైనా పట్టుకొస్తావా ?"

"ఆఁ ... పట్టుకొచ్చి, పట్టించేస్తాను."

"అసలు నీకు ప్రసన్నుడవుతేగదా!"

"కొండమీది కోతిని కోరుకుంటావా ?"

"నీలాంటి కొండముచ్చును కోరుకుంటాను." వాసవిని గిల్లింది నళిని.

నవ్వుతూ ప్రక్కకు తప్పుకుంది వాసవి.

"సరే! నా మాటకేంగాని, బావ యెలా వుంటాడు ?" ప్రశ్నించింది నళిని.

"బావ .. బావలా వుంటాడు."

"అబ్బ! హాస్యం చాలించి, చెప్పవే! ఎలా వుంటాడు ? నీకు నచ్చాడా ?"

"నేను చూసి రెండేళ్ళయింది. సెలవులకి కూడా నీతో వుండటం మూలాన, బావ ఇంటికి

# ప్రపంచంలో బాలలు

ప్రపంచంలో ప్రస్తుతం జనాభా నాలుగు వేల మిలియన్లు. పదిహేను సంవత్సరములలోపు వున్నవారు ఒక వేయి ఐదువందలు. దీనిలో ఒక వేయి రెండువందల మిలియన్లు బాలురు బాలికలు డెవలపింగు దేశాలలో వున్నారు. మొత్తం జనాభాతో పోల్చి చూస్తే బాలబాలికల సంఖ్య శాతం అభివృద్ధి చెందుతున్న దేశాలలో చాలాతక్కువ— సుమారు నలభై మూడు నుండి నలభై ఐదు శాతం వరకూ వుంటారు. ఉత్తర అమెరికాలో ఇరవై ఐదు శాతం మటుకే వుంటారు. యూరపులో ఇరవై ఐదు శాతం తక్కువ బాలులు, బాలికలు వుంటారు. పందొమ్మిది వందల డెభ్భై తొమ్మిదవ సంవత్సరాన్ని బాలురు బాలికల సంవత్సరంగా ఎన్నుకున్నట్లు మనందరికీ తెలుసు. శిశు మరణాల పట్టిక చూస్తే ఆశ్చర్యంవేయక మానదు. ఆఫ్రికా దేశంలో ఒక సంవత్సరం పూర్తికాకుండానే మరణించే సంఖ్య ఐదుమందిలో ఒకరు చనిపోతారు. జపాను, స్కాండినేవియా దేశాలలో నూరుమంది శిశువులలో ఒక్కడు మాత్రమే మరణిస్తాడు. వెయ్యిమంది శిశువులు జనిస్తే నూటయాభై మరణాలు వుంటవి. ఆఫ్రికాలో, ఉత్తర దక్షిణ అమెరికాలల్లో వెయ్యిమంది మరణిస్తారు రష్యాలో శిశు మరణం వెయ్యికి ఇరవై ఆరు, జర్మనీలో వెయ్యికి పదిహేడు, నాలుగు మాత్రమే ఐదు సంవత్సరాలు నిండకుండానే మరణించే శిశువుల సంఖ్య పదిహేను, ఐదు మిలియన్లు వుంటారు. ఈ నూటయాభై ఐదు లక్షల శిశువులలోనూ నూటయాభై లక్షల శిశు మరణాలు అభివృద్ధి చెందుతున్న ఇండియా లాంటి దేశాలలోనే సంభవిస్తున్నాయి. వీటిలో నూటికి తొంభై శాతం మరణాలను అరికట్టడానికి వీలవుతున్నది. పరిశుభ్రమయిన నీరు, తగిన శిశుపోషణ రక్షణ, వైద్య సదుపాయాలు వున్నట్లు అయితే దీనిని సాధించవచ్చు. మొత్తం ప్రపంచంలో జన్మించే శిశువులలో ఆరుమందిలో ప్రతి ఒక్క శిశువు బలహీనంగాను బరువు తక్కువగాను పుట్టడం జరుగుతుంది. ఇలా బరువు తక్కువగా జన్మించే శిశువులలో నూటికి తొంభై ఐదు మంది శిశువులు అభివృద్ధి చెందుతున్న ఇండియా, పాకిస్తాను మున్నగు దేశాలలోనే జన్మిస్తున్నారు.

**పండా? పాపడా?**



ఫోటో : బోనేపల్లి మురళి

వచ్చినప్పుడు చూసే అవకాశం కలగలేదు.''

''సో ... నన్ను తప్ప పడుతున్నావన్నమాట.'' నిష్ఠూరం అభినయించింది.

''అది కాదు. ఆ తరువాత బావ ట్రెయినింగ్‌లో మూడేళ్ళున్నారు. ట్రెయినింగ్ వెంటనే తెలంగాణాలో పోస్టింగ్ ఇచ్చారు.''

''ఎలావుంటాడని కదూ అడిగింది ? అది చెప్పకుండా డొంకతిరుగుడు జవాబులు చెబుతావ్ !''

''పెద్ద ఆఫీసర్‌లాగ 'ఆన్సర్ టు ది పాయింట్' అన్నట్టుగా అడుగుతున్నావా ?''

ఓసీ వదరుబోతూ! వట్టి మాటలు కట్టిపెట్టి, గట్టి నిజమును చెప్పవే!'' నాటక ఫక్కీలో అడిగింది.

''ఆరడుగులవాడేనా ?''

''ఆఁ... వాడే.''

' అందగాడేనా ?''

''... .. గాడే''

''మరి సింహరాజ మధ్యముడా ?''

''... ... మధ్యముడే''

''సద్గుణ సంపన్నుడా ?''

''... ... సంపన్నుడే !''

''సత్యవ్రతుడా ?''

''... ... వ్రతుడే !''

''అలుక రానివాడా ? అసూయ లేనివాడా ? విశాల...''

హోల్డాన్... హోల్డాన్ ! ఆపు తల్లీ నీ యక్ష ప్రశ్నలు. ఇంతకూ – ఏ నవలలోని హీరో గుణాలు తల్లీ ఇవి ?

''వేళాకోలంగా వుందా ? ఉత్తమ పురుషుని గుణాలను వర్ణిస్తున్నాను.''

''ఈ భూప్రపంచంలో వుంటాడంటావా ?''

''తప్పకుండా! నా వాసవి భర్త అలాగే వుంటాడు !''

''అంత గ్యారంటీయా ?''

''నా మాట వేదం చిట్టితల్లీ.''

''అలాగా బుజ్జీ'' అంటూ నళిని బుగ్గ నొక్కింది వాసవి. అంతలో పని కుర్రవాడు వచ్చి 'రమ్మంటూ' కేకవేసి పిలిచాడు మరి కాసేపటికి పాలేరు వచ్చి అన్నయ్య పిలుస్తున్నాడని చెప్పాడు. ఇక వెళ్ళక తప్పలేదు. మంచె సులభంగా ఎక్కగలిగారు. కాని దిగటానికి భయంవేసింది

''కూకోని దిగండి'' అంటూ పనిపిల్లవాడు తరుణోపాయం చెప్పాడు.

ఇద్దరూ అరచుకుంటూ, నవ్వుకుంటూ క్రిందకు దిగారు.

చిన్నన్నయ్య ఇంకా పొలంలోనే వున్నాడు.

''మీరిక ఇంటికి వెళ్ళండి! ఎండ మండి పోతుంది!'' చిన్నన్నయ్య ఆజ్ఞాపిస్తున్నట్టు చెప్పాడు. ఎండకు ముఖమంతా చెమటతో తడిసి పోయింది. అన్నయ్య కష్టాన్ని చూస్తుంటే కాస్త జాలి కలిగింది.

''ఇంకా ఈ పాతకాలపు తలగుడ్డతోనే పని చేస్తున్నాడు. ముఖానికి కూడా నీడ వుండేట్టు వెడల్పాటి ఈతాకు టోపి తలపై వుంచుకుంటే బాగుంటుందికదూ ! నీవైనా సలహా చెప్పరాదూ?'' మందలింపుగా అన్నది నళిని.

''కరెక్ట్ ! గుడ్ ఐడియా !''

''అన్నయ్యకు చెప్పిచూద్దాం !''

ఎండతీవ్రతకు తట్టుకోలేక తలపైన చెంగులు కప్పుకుని ఇంటిదారి పట్టారిద్దరూ !

*[ఇంకా వుంది]*




ఒక పరమాణువును శతసహస్రకోటి ముక్కలుచేసి అందులో ఒక ముక్కను తీసుకుని వెంకయ్యతో పోల్చిచూస్తే ఆ రేణువు అతనికంటె అనేక కోట్ల రెట్లు పెద్దది. అటువంటిది అనంతకోటి గోళాలతో నిండిన విశ్వాంతరాళంతో పోలిస్తే అతని గతేమిటి? అత్యధిక శక్తివంతమైన ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్‌తో చూసినా వెంకయ్య దర్శనం దుర్లభం. అయితే అది విశ్వాంతరాళంతో పోలిస్తే సంగతి

ఒకానొక పట్టణంలో ఏడువందల చతురపు గజాల ఆవరణలో ఏడు గదుల ఆఫీసులో ఒక గదిలో గాడ్రెజ్ టేబుల్ వెనకవున్న తిరుగుడు కుర్చీలో సుష్టుపూర్తిగా కూర్చున్న వెంకయ్య భేతాళుడికన్న పెద్దవాడు! అక్కడ పని చేస్తున్న ఇరవైమందికీ అధికారి - ఆఫీస్ మేనేజర్. మరి నేనో? - గుమాస్తా చిన్న 'పెద్దగుమాస్తా'

"సార్, పిలుస్తున్నారు సార్!"

"ఎవరు?"

"అయ్యగారు సార్!"

"ఏ అయ్యగారు?"

"మేనేజరుగారు సార్!"

కలం బల్లమీద పెట్టి ఫైలు మూసేసి వెళ్ళాను. వెళ్ళి సవినయంగా నిలబడ్డాను. ఎంతలేదన్నా మేనేజరేమో మహాబిజీగా వున్నాడు. తలెత్తి చూడలేదు. దీక్షగా వార్తాపత్రిక చదువుతున్నాడు. పది నిముషాలపాటు పాదాలకు శ్రమ యిచ్చిన తర్వాత మెల్లిగా అన్నాను.

"సార్!"

మేనేజర్‌సాబ్ మెల్లగా తలెత్తి అమాంతం ఆ ఆరడుగుల్నీ, నూటఅరవై పౌన్లనీ ఇగ్నోర్‌చేసి మళ్ళీ పత్రికలో మునిగిపోయాడు. నాకప్పుడు 'ఆర్యభట్ట' మీద కూర్చుని ఆయన్ని చూద్దామనిపించింది.

"ఫిగర్సన్నీ వెరిఫై చేశారా?" తలెత్తకుండానే అడిగాడు.

"ఆఁ... చేశానండి...అబ్బే చేసేస్తానండి." ఒక్కసారి ఉపగ్రహంమీంచి ఊడిపడి మా ఆఫీస్ మేనేజర్ వెంకయ్యగారి ముందు మైక్రోస్కోపిక్‌గా నిలబడి తబ్బిబ్బై సమాధానం చెప్పాను.

"ఇదుగో చూడండి—మీరేం చేస్తుంటారు?"

"ఎక్కడండి?"

"ఎక్కడో ఏదో చేసుకుంటే నాకెందుకూ? ఆఫీసులో సంగతి."

"పని"

"ఏం పని?"

"ఆఫీసు పని"

"ఏ ఆఫీసు?"

"ఏ ఆఫీసేవిటండి? - మన ఆఫీసే"

"ఆఁ — ఆగండి. మన ఆఫీసు పని మీరు చేస్తుంటే వెరిఫికేషన్ బిజినెస్ మూడు రోజుల క్రితం అయిపోయివుండవలసింది. ఇన్ఫరెన్స్? మీరు పని చెయ్యటంలేదన్నమాట."

"అయితే పనిచెయ్యక నిద్రపోతున్నానంటారా?" వళ్ళు మండి ధైర్యంచేసి అడిగేశాను.

"ఆఁ — సరిగా అదే అంటాను."

వెంకయ్యగారు మేనేజర్ కావచ్చు. గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్లు తగలెయ్యవచ్చు. ఆఫీసులో హాయిగా వార్తాపత్రికలు చదువుకుంటూ కూర్చోవచ్చు. కాని... ఉదయంనించి సాయంత్రందాకా యంత్రంలా పనిచేస్తుంటే నిలువునా నిర్మొగమాటంగా నిద్రపోతున్నానవడం ఈయనకేకాదు, ఏ మేనేజరుకయినా తగనిపని. ఒక్కసారి గగనవిధుల్లో విహరిస్తూ పరమాణువు చూర్ణంలో ఒక రేణువుకంటే కూడా అల్పుడైన వెంకయ్యను చూడాలని మహా ఉబలాటపడ్డాను.

"సరే. ఆ వెరిఫికేషన్ అట్లా వుంచండి హెడ్డాఫీస్‌కి మనం మన్త్లీ రిపోర్టు పంపాలి రేపు సాయంత్రానికి రిపోర్టు తయారుచేసి నాకు స్వయంగా అందచెయ్యండి. కావలసిన డేటా అంతా ఈ ఫైల్లో వుంది. మోహనరావుగారు శలవు పెట్టిన సంగతి మీకు తెలుసుగా" అంటూ సాభిప్రాయంగా నావేపు చూశాడు వెంకయ్యసాబ్.

దేనికైనా హద్దూపద్దూ వుండాలి. నా పనితోనే నాకు ఊపిరి సలపకుండావుంటే పైగా శలవుపెట్టినవారి పనులుకూడా నా నెత్తిన రుద్దడం ఏం న్యాయం? శాస్త్రిగారు శలవు పెట్టిన ఫలితంగా నామీద పడినదే యీ వెరిఫికేషన్ వర్క్ కూడా. అది చాలక మోహనరావుగారి పని కూడాను — ఇంతా చేస్తే నాకు ప్రతిఫలం ఏమిటి?

ఒక్క చీదరింపు. కాకపోతే రెండు చివాట్లు! మనోభావాలను మనసులోనే అణిచిపెట్టి మారు మాట్లాడకుండా ఫైల్‌తోసహా స్వస్థానం చేరుకుని మంటి కుర్చీలో కూలబడ్డాను.

## 2

"ఎన్నిసార్లు పిల్చినా పలకరేం? ఈపూట భోజనం చెయ్యదల్చుకోలేదా?"

"........"

"ఇదుగో ... మిమ్మల్నే ... మాట్లాడరా?"

"........"

"మాట్లాడరన్నమాట. ఉండండి చెప్తా..."

"ఇదుగో నీకు బుద్ధుందా లేదా? — చక్కిలిగింతలు పెడతావేం? పని చేస్తున్నా ననుకున్నావా, పాన్పుమీద పవ్వళించాననుకున్నావా?"

"అబ్బ ఎంత కోపమండీ. పనుంటేవాలు మీకు. పాన్పూ అక్కర్లేదు, భోజనం అక్కర్లేదు"

"ఇదుగో మాణిక్యం, నువ్వెళ్లి భోంచెయ్యి నేనీ పూట భోంచెయ్యను. రిపోర్టు తయారవందే న్రిద కూడా పోను. చాలా ఇంపార్టెంట్."

"మీకిష్టమని బంగాళాదుంపలు వేయించి, పప్పుపులుసు పెట్టాను. భోజనంచేసి వెళ్లండి. పని ఎక్కడికీ పారిపోదు ఇక్కడే వుంటుంది"

"నీకెంతైనా పుణ్యముంటుంది. నువ్వెళ్లి భోంచెయ్, నన్ను బాధపెట్టకు."

"ఊహుఁ. మీరు భోజనం చెయ్యకపోతే నేనూ చెయ్యను."

"........"

"అబ్బ రండీ సరదాగా మనిద్దరం భోంచేద్దాం."

"అసలే ఫైళ్లతో కుస్తీపడుతూ సతమతమవుతుంటే సరసం కూడాను. మాణిక్యం పట్టుపట్టిందంటే విడవడమంటూ వుండదు. ఫల్గాకంపట్టు. భోజనంచెయ్యక తప్పలేదు. అయితే, బంగాళాదుంపల ముక్కలు బాగానే వున్నాయనుకోండి!"

"చూడండీ — మీకు న్రిద లేకపోతే ఆరోగ్యం చెడుతుంది. హాయిగా పడుకోండి. పని సంగతి రేపు చూసుకోవచ్చు."

"నన్నట్టే బాధపెట్టక నువ్వెళ్లి పడుకో."

"న్రిదపొమ్మంటే బాధపెట్టానా? — బలేవారండీ మీరు."

"ఈ ఫైలు పూర్తవగానే పడుకుంటాను. నువ్వెళ్లి పడుకో."

"అదేం కుదరదు. మీరు ముందు న్రిదపోవలసిందే."

"ఈ ఫైళ్లు బ్రహ్మరాక్షసుల్లాగా ఇక్కడ వుంటే న్రిద ఎట్లా పడుతుంది?—నువ్వే చెప్పు"

"మరేం ఫరవాలేదు, నే పట్టిస్తా రండి..."

## 3

మర్నాడు మధ్యాహ్నం పన్నెండు గంటల ఎదకొండు నిముషాలకు మేనేజర్ గదిలో చిన్న తుఫాను చెలరేగింది. మేనేజర్ ముఖం కారుమబ్బు. కళ్ళు మెరుపులు, మాటలు ఉరుములు తుఫాను ఉధృతం తగ్గాక మెల్లిగా ఎక్స్‌ప్లెయిన్ చెయ్యడం మొదలుపెట్టాను.

"క్షమించండి సార్. ఫైల్స్ పూర్తవుతే కాని న్రిద పోకూడదనుకున్నాను నిన్న రాత్రి, కాని మా ఆవిడ పట్టించేసింది సార్."

"వాట్ ది డెవిల్ డు యు మీన్? బిజినెస్ బిఫోర్ ప్లెజర్. దట్ మస్ట్ బి ది మోటో. ఆ మాత్రం తెలియకపోతే మీరు జీవితంలో పైకి రాలేరు."

"అదికాదు సార్..."

"ఏదికాదు?"

"అదే సార్... వాట్టె మీనిట్ రాత్రి తలనెప్పొచ్చింది సార్. మా ఆవిడ అమృతాంజనం పట్టించేసింది కణతలకి."

"అప్పుడు మీకు పట్టేసిందికదూ న్రిద? - ఫైన్, వెరీ ఫైన్!"

"ఎగ్జాట్లీ సార్."

"షటప్ అండ్ గెట్ ది హెల్ ఔటాఫ్ హియ."

మెల్లిగా ఐ గాట్ ది హెల్ ఔటాఫ్ దే అండ్ టుక్ మై రికెటీ ఛైర్ — కూర్చున్నానన్నమాటేకాని నా మనస్సు ఊహాలోకంలోకి వెళ్ళిపోయింది — అనంతకోటి గోళాలతో నిండిన విశ్వాంతరాళం. అందులో భూగోళం, అందులో ఒక ఖండం. ఆ ఖండంలో భారతదేశం. అందులో ఒక రాష్ట్రం, ఆ రాష్ట్రంలో ఒక నగరం. అక్కడ ఏదో మారుమూల ఆఫీసులో, ఓ మారుమూల గదిలో తిరుగుడు కుర్చీలో కూర్చున్న వెంకయ్యని వైరస్‌కన్న చిన్నవాడ్నిగా చూసి మనసారా ఆనందించాను. అంతకంటె యింకేం చెయ్యను? — చెయ్యగలను?!

"సార్, పిలుస్తున్నారు సార్!"

"ఎవరు?"

"అయ్యగారు సార్!"

"ఏ అయ్యగారు?"

"ఇంకే అయ్యగారు సార్? — మన మేనేజరుగారు సార్!"

"ఓ — దట్ స్మాలర్ దేన్ ది వైరస్ యు మీన్?"

"అంటే ఏమిటి సార్?"

"ఏం లేదులే. వస్తున్నా పద."

పిల్లిని 'హూష్' అంటే పారిపోతుంది. అదే పిల్లిని గదిలో పెట్టి తలుపులన్నీ మూసి కొట్టబోతే గుడ్లు పీకుతుంది. పిల్లికి వున్న సెల్ఫ్ డిఫెన్స్ మనిషినైన నాకు మాత్రం ఎందుకుండకూడదూ? అయినా నేనేం తప్పు చేశానని? నా పని బాధ్యతతో, సమర్థవంతంగా చేస్తూనేవున్నాను. శలవుపెట్టిన వాళ్ళ పనంతా నన్ను చెయ్యమంటే ఎట్లా చెయ్యను? ఎట్లా చెయ్యగలను? అయినా నేనెందుకు చెయ్యాలి?

చొక్కా చేతులు పైకి మడిచి ధైర్యం కూడగట్టుకుని కుడి కాలు ముందర పెట్టి గదిలో ప్రవేశించాను. అక్కడి వాతావరణం పూర్తిగా మారిపోయి వుంది. ఇందాకటి గాలివాన వెలిసే ప్రశాంత వాతావరణం నెలకొనివుంది. మేనేజర్ ముఖం కూడా ప్రశాంతంగా వుంది. పైగ వార్తాపత్రిక చదవడంలేదు!

"నిలబడ్డారేం? — కూర్చోండి."

నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఎంతసేపైనా నిలబెట్టి మాట్లాడటమేకాని కూర్చోమని ఎన్నడూ అనలేదు. ఏమిటో యీ ఆకస్మికాభిమానానికి కారణం? సరిగ్గా ఆయనకు ఎదురుగావున్న కుర్చీలో కూర్చున్నాను తంచన్‌గా.

"ఫైల్స్ గూర్చి మీరేం విచారించకండి అవి ఆనందరావుకి అంటగడతాను— మీరు మాత్రం నాకో చిన్న సాయం చెయ్యాలి."

నేనా? మేనేజర్‌గార్కి సాయం చెయ్యడమా! అంటే ఆయనకు సాయం చెయ్యగల్గిన సమర్థుడ్నన్నమాట చాలా సెల్ఫ్ ఇంపార్టెన్స్ ఫీలయ్యాను. ఆ క్షణంలో ఆయన్ని అంతరిక్షంలోంచి చూడాలని అనిపించలేదు.

"చెప్పండి. నేను చెయ్యగల్గినదైతే తప్పక చేస్తాను" సస్పెన్స్ భరించలేక అడిగేశాను.

"మీరు చెయ్యగలిగిందే, అంటే మీ ఆవిడ చెయ్యగలిగింది — టు బి ప్రిసైజ్."

ఏమిటబ్బా మా ఆవిడ ఈయనకు చెయ్యవలసిన సాయం? కొంపతీసి సినిమాకి కంపెనీ కీప్ చెయ్యమనడుకద.

"దయచేసి మా ఆవిడ మీకు చెయ్యవలసిన సాయం ఏమిటో తెలుపుస్తారా?" ఉండబట్టలేక అడిగేశా.

"అబ్బ. వెధవ తలనెప్పి. గంటనించి ప్రాణం తీసేస్తోంది."

కొంపతీసి కణతలకి అమృతాంజనం పట్టించమంటాడేమో నా అర్థాంగిని. అంతే. అదే అయివుంటుంది. పైకుబికివస్తున్న కోపాన్ని అణచిపెట్టి సాధ్యమైనంత మృదువుగా అన్నా —

"ఇంతకీ మీరనేది మా ఆవిడ వచ్చి మీ కణతలకి..."

"నో నో నో నో నో, డోంట్ బీ సిల్లీ" అంటూ టేబుల్‌మీదున్న కాలింగ్ బెల్‌ని ఓ మొట్టికాయ మొట్టాడు.

"సార్" అనుకుంటూ ప్యూన్ ప్రత్యక్షమయ్యాడు.

"రెండు స్ట్రాంగ్ కాఫీ"

నా ఆశ్చర్యానికి అంతులేదు. మేనేజర్‌గార్కి నామీద ఇంత ప్రేమ ఎందుకు పుట్టుకొచ్చిందో. ఒకవేళ నాచేతే రాయించుకుంటాడేమో అమృతాంజనం.

"ఇదుగో యిది ఏ సీజనూ?" నా ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ అన్నాడు మేనేజర్ వెంకయ్య.

"సమ్మర్ సర్"

"సమ్మర్లో మనం ఏంచేస్తాం?"

"మీరు ఏ. సి. గదిలో కూర్చుని ఫైళ్ళమీద సంతకాలు పెడతారు నేను సీలింగ్ ఫాన్ పదిమందితో పంచుకుని పని చేస్తూంటాను."

"డేమ్ ది ఆఫీస్. ఆఫీస్ సంగతి కాదండీ నేను చెప్పేది. ఇంటి సంగతి."

"మీరు కూల్‌డ్రింక్స్ తాగుతూ కుక్కలతో

[ 35వ పేజీ చూడండి ]

## "కుడి ఎడమైతే" లో దత్తుడి తికమకలు

జంకుతూ, అడుగులో అడుగు వేసుకుంటూ లోనికొచ్చిన దత్తుడు (నూతన్‌ప్రసాద్)ని చూసి సావిత్రి (జయలక్ష్మి) విస్తుపోయింది. "ఏవిటీ అవతారం? పొద్దున వేస్కెళ్లిన పేంటు ఏవయింది? షర్టు ఏవయింది? లుంగీతో వచ్చారేమిటి?"

దత్తుడు తమాయించుకుంటూ, "నీ మంగళ సూత్రాలు గట్టివి. బూమ్మీద నీకు పసుపూ, కుంకుమలతో నిలబడే యోగముంది. అందుకే రెండో జన్మెత్తొచ్చాను సంతోషించు," అన్నాడు.

"ఏవిటండీ? అసలేం జరిగింది?"

"పొద్దుటిక్కడ్నుంచి బయల్దేరానా? ఎయల్దేరి తిన్నగా తాలూకాపీసు కెళ్లాను. అక్కడ ఆటా అవీ సూసుకొని —"

"ఆట?"

"అదేనే పాట. సింతసెట్టు పాట. ఆ పాటల గురించి తాసిల్దారుగారితో సెప్పించి, యీ యేలన్నా పెందరకాడే యిల్లు సేరదామని జోరుగా వత్తా వున్నాను. వత్తావుంటే — యేట్లోపడి ఒకడు కొట్టుకుపోటం కనబడింది. దాంతో లాగు, సొక్కా యిప్పి గట్టుమీద పడేసి, యేట్లో వురికేను. పెణయంలాంటి పెవాహంలో కొట్టుకుపోతుంటే గట్టిగా కౌగిలించి పట్టుకున్నాను. నా కౌగిల్లోంచి తప్పించుకోవాలని సూసింది —"

"సూసిందా!"

"యేంటే నువ్వు యిలా పట్టుకున్నావ్? సూసేదా? అయినా, నేను వదల్లేదు. వొడ్డుకు మోసుకొచ్చాను. ఆ పిల్లోడ్ని పంపించేసి, బట్ట లాసుకున్నాను. యింకేవుంది?"

"యేమైనాయండి?"

"మాయమైనాయ్. కుక్కెత్తుకెళ్లిందో, పిల్లెత్తుకెళ్లిందో, మడిసెత్తుకెళ్లాడో కనిపించలేదు. యేం సేయను? అండమ సెడ్డీతో యింటికి రావడానికి నేనేమన్నా మామ్మూలు పేసింజర్నా? నా శీలం సిత్తసిత్తయిపోదూ? అందుసేత, ఆపలంగా మళ్ళా పట్నం యెల్లి, ఓ ఫెండు నడిగి యీ లుంగీ కట్టుకొని, యీ శరీరాన్ని యిలా మోసుకొచ్చేను."

"సరేలెండి. బట్టలు మార్చుకురండి. అన్నం వడ్డిస్తాను" అని సావిత్రి తృప్తిగా నిట్టూర్చిందే గాని, అసలు సంగతి ఆమెకేం తెలుసు?

ఆ సంఘటనలను మధ్య మధ్య ఇంటర్ కట్స్‌తో చూపిస్తాం," అన్నారు యువదర్శకుడు టి. ఎల్. వి. ప్రసాద్ నా వంక తిరిగి. వీరి తండ్రి తాతినేని ప్రకాశరావు ఈ "కుడి ఎడమైతే" చిత్ర నిర్మాత. రోజారమణి ఈ చిత్రంలో ఒక క్లిష్టమైన పాత్రను చాతుర్యంతో నిర్వహించింది.

"ఓర్పుకు మారుపేరు స్త్రీ. ఆ పేరు సార్థకం చేసుకునేందుకు - బజారున పడబోయే తన సంసారాన్ని నిలబెట్టుకోడానికి ఒక 'సబల' చేసిన ప్రయత్నం, ఆమె పొందిన అంతిమ విజయమే ఈ కథకు ఇతివృత్తం. నేను కోరగానే



దాసరి నారాయణరావుగారు ఈ విశిష్టమైన కథను రాసి యిచ్చారు. వారికి ఎంతైనా కృతజ్ఞుడ్ని," అన్నారు డైరెక్టర్ టి. ఎల్. వి. ప్రసాద్.

ఈ చిత్రం అనంతరం టి. ఎల్. వి. ప్రసాద్ దర్శకత్వం నెఱపే అనిల్ ప్రొడక్షన్స్ మరో వర్ణ చిత్రంలో ఎన్. టి. ఆర్. హీరో. జయప్రద హీరోయిన్. సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్ ముఖ్య భూమికలను నిర్వహిస్తారు. జూలై మొదటి వారంలో పాటల రికార్డింగ్ తర్వాత జూలై 19న షూటింగ్ ప్రారంభమవుతుంది.

## గాలు -జి. వి. జి.

### "గోరింటాకు"

వైద్య శాస్త్రంతో పరిచయం ఉన్న వారికి ప్రజల నాడి బాగా తెలుసు గనుకే లోగడ కె




మురారి సర్వజనాకర్షణీయమైన "సీతా మాలక్ష్మి" చిత్రాన్ని నిర్మించారు ఇప్పుడా చిత్రాని కన్నా మిన్నగ "గోరింటాకు" చిత్రం తయారవ్వు తూందన్న సంకల్పస్తే, ఉత్సాహం ఆయనలో

ఆ నవరసాలను ఎలా అందజేయాలో బాగా తెలిసిన నిష్ణాతుడని ఏనాడో నిరూపించుకున్నారు ఈ చిత్రాన్ని సమర్పించే కె వరసింహం నాయుడు. ఇంజనీరు గనుక చిత్రీకరణ నిమిత్తం విశాఖలోని

కనిపించాయి— లొకేషన్‌కు ఆహ్వానింపబడిన కొందరు పాత్రికేయులకు. ఇక, రైటర్—డైరెక్టర్ దాసరి నారాయణరావు ప్రేక్షకులకు ఏం కావాలో,

రమ్యమైన భవంతులను ఎన్నుకున్నారు. ఒక చక్కని చిత్రం తయారవడానికి ఈ ముగ్గురితో పాటు యువ చిత్ర యూనిట్‌లోని వారందరూ తీసుకుంటున్న శ్రమ, శ్రద్ధాసక్తులు కళ్లారా చూసే అవకాశం కలిగింది పాత్రికేయులకు.

గోళ్లు ఎర్రగా పండేలా చేయడానికి గోరింటాకు తాను ఎండిపోతుంది. అందుకే మానవ జీవితంలోని మమతానురాగాలను మధుర మనోజ్ఞంగా చిత్రించే ఈ చిత్రానికి "గోరింటాకు" అని పేరు పెట్టటం జరిగిందని సూక్ష్మంగా తెలిపారు దాసరి ఆయన తెర వెనుకే కాక తెర ముందు కూడా ప్రజలకు బాగా పరిచితుడు గనుక షూటింగ్ చూడడానికి వచ్చిన ప్రజలంతా "అదుగోరా, గురువుగారు!" అంటూ గుర్తు పట్టసాగారు

శోభన్‌బాబు ఒక సరికొత్త పాత్రను పోషిస్తున్నారు. ఆయన సరసన యిద్దరు కొత్త యువతులు నటిస్తున్నారు. ఒక యువతి తమిళ సినిమా రంగంలో విశేష ఖ్యాతి నార్జించిన సుజాత ఈమె మాతృ భాష మళయాళం. "గుప్పెడు మనసు" అనే కె. బాలచందర్ దర్శకత్వంలో తయారయ్యే మరో తెలుగు చిత్రంలోనూ నటిస్తోంది. "శివరంజని, సిరిసిరి మువ్వ, దేవుడు చేసిన పెళ్లి" ఈమె చూసిన తెలుగు చిత్రాలు మరో నాయిక వక్కలంక పద్మ. బి యె (ఆనర్స్) పట్టాతో పాటు జర్నలిజంలో డిప్లొమా పొందిన విద్యాధికురాలు. ఈమెకు "గోరింటాకు" తొలి చిత్రం. లోగడ గ్వాలియర్—రేయాన్స్ ప్రకటనలో మాడల్ గర్ల్‌గా పోజు లిచ్చింది. కాలేజీ నాటకాలలో ఎన్నో ట్రోఫీలు గెల్చుకుందట జర్మన్ సాహిత్యాన్ని కూడా క్షుణ్ణంగా అభ్యసించింది గనుక ఆరేడేళ్ల తర్వాత జర్మన్ బోధకురాలుగా స్థిర పడాలని ఉందట. ఈలోగా యువచిత్ర లాంటి ఉత్తమ సంస్థల నుంచి ఆఫర్లు వస్తే, నటించడానికి సిద్ధమేనట

చలం, రమాప్రభ జంట తొలిసారి కనిపించే ఈ చిత్రంలో సావిత్రి, ప్రభాకరరెడ్డి, రమణ మూర్తి, కె. వి. చలం, శ్యామల, జయ విజయ మున్నగు వారున్నారు. దేవులపల్లి, శ్రీశ్రీ, వేటూరి రాసిన కమ్మని గీతాలకు శ్రావ్యమైన బాణీలు కూర్చారు మహదేవన్ యు. రాజగోపాల్ ఛాయ, తోట శిల్పం, జి. జి. కృష్ణారావు కూర్పు, రమణ బాబు సహకార దర్శకత్వం ఈ రంగుల చిత్రానికి ఇతర హంగులు. మొదటి షెడ్యూల్ రాజమండ్రిలో గోదావరి తీరంలోనూ, రెండవ, మూడవ షెడ్యూల్స్ విశాఖపట్టణం పరిసర ప్రాంతాలలో జరగడంతో షూటింగ్ ఘట్టం పూర్తవుతుందని తెలియ జేశారు ఈ చిత్రానికి నిర్మాణ సారధ్యం వహిస్తున్న అనుభవజ్ఞుడు ఎం ఎ రెడ్డి.

## "మీ సమీపంగా 'స్కైలాబ్' పతనమవడం సంభవిస్తే....?"

| | |
|---|---|
| రాజ్‌బాబు | "హాయిగా కళ్ళుమూసుకొని పడుకుంటాను" |
| గోజారంగడి | 'చెక్కా పెట్టేలు తీసేస్తాను" |
| గీత | "గొడుగు చేతబట్ట నిలుచుంటాను" |
| శుభ | "ఏం జరుగుతుందోనని డప్పగింది చూస్తుంటాను" |
| కవిత | "తలకు హెల్మెట్ ధరించి స్కూటర్ మీద తిరుగుతాను" |



'కళ్యాణ చక్రవర్తి'లో కృష్ణంరాజు

# సినిమా

### 'రతీ మన్మథ'లో ప్రణయానికి దారితీసిన పరిచయం

అనుకోకుండా సుశీల (సంగీత), రాజా (గోపీకృష్ణ) ఒకచోట కలిశారు వానలో తడిసి, ఒక బోట్ హౌస్‌లో తలదాచుకున్నారు

"మీ ఇల్లెక్కడ?" రాజా అడిగాడు

"నేనుండేచోట," అంది సుశీల చిలిపిగా

"మీ ఇల్లు తెలుసుకోవాలంటే నాకేం అంత కష్టం కాదు కళ్ళు మూసుకొని 'రోజా రోజా!' అంటూ నీ నామం జపం చేశానంటే — మీ ఇల్లు నా కళ్ళముందు ప్రత్యక్షమవుతుంది"

"సరే అయితే, మీరు జపం చేస్తూండండి" అంటూ సుశీల అక్కడ్నుంచి జారుకుంది

ఎస్ వి సుబ్బరాజు సమర్పించే శ్రీ వాణీ వరలక్ష్మి కంబైన్స్ "రతీ మన్మథ" చిత్రంలో ప్రసాద్‌బాబు, వంకాయల, సి. హెచ్. కృష్ణమూర్తి, గిరగ, రాజ్యలక్ష్మి, లక్ష్మీ చిత్ర, ఇంద్రాణి, జయశీల ఇతర పాత్రధారులు ఎస్ వరలక్ష్మి కథకు కె వి రమణమూర్తి స్క్రీన్‌ప్లే, సంభాషణలు రాశారు. సత్యం సంగీత దర్శకుడు వి వి. రామ్ చౌదరి ఛాయాగ్రాహకుడు. పి వి ఎస్. వి. ప్రసాద్ నిర్మాత పోలవరపు బ్రహ్మానందరావు దర్శకుడు

### "సస్పెన్స్ అంటే ఏమిటి?"

—అని సస్పెన్స్ కింగ్ ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్‌ను ఒక విలేఖరి అడిగాడు అందుకాయన ఇచ్చిన జవాబు "హీరో సమీపంగా ఒక టైమ్‌బాంబ్ వాటున ఉంచబడింది. అది కాస్సేపట్లో పేలుతుందని ప్రేక్షకులకు తెలుసు. కాని, హీరోకు [illegible] మాత్రం తెలీదు. అదే సస్పెన్స్!" అని మూడు ముక్కల్లో వివరించాడట.





## అల్లరి వయసులో అల్లరి గోపి

పరమలోభి పాపారావు (అల్లురామలింగయ్య) కొడుకు గోపీ (నాగేష్) ఉదయాన్నే సన్యాసి వేషం వేసుకొని, మేడ రైలింగ్ మీంచి జారుతూంటే పాపారావు కడుపు రగిలిపోయింది "ఆహా! అవతారం చాలా బావుంది, నాయనా! పొద్దున్నే ఎటులుదేరావెక్కడికి ? బస్ స్టాండ్‌కా ? రైల్వే స్టేషన్‌కా ?"

"ఎందుకూ ?" అన్నాడు గోపి.

"ముష్టెత్తడానికి"

'ఛా ఛా! నన్ను మీరు చాలా తక్కువ అంచనా వేశారు నేనిప్పుడు ఒక భగ్నప్రేమికుడ్ని. గొప్ప సన్యాసిని," అంటూ ముక్కుపొడుం పీల్చాడు గోపి

"అరే-అరే! ఏమిట్రా అది! ముక్కుపొడి పీలుస్తున్నావా ?"

"లేకపోతే కాఫీపొడి అనుకున్నావా ...?" అంటూ గోపీ జర్దాకిళ్ళీ నోట్లో వేసుకొని, ఆ తర్వాత సిగరెట్ తీసి, "మేచ్ బాక్స్ ఉందా?" అంటూ తండ్రిని అడిగాడు

"ఒరేయ్, గోపీ! ఏమిట్రా ఈ అన్యాయం? తాగుడు ఒక్కటే లేదన్నమాటేగాని – దేవదాసయిపోతాన్నురా ?"

"లేదని ఎవరన్నారు ? అదీ వుంది," అంటూ సంకకు తగిలించుకున్న జోలెలో నుంచి గోపీ బ్రాందీ బాటిల్ తీశాడు "ఇందులో సగమే వుంది లేకపోతే నీకూ ఇచ్చేవాడ్ని"

"ఇలా అయిపోయావేమిట్రా! తండ్రి అనే గౌరవం కూడా లేదేమిట్రా ?"

'ఎక్కడ తండ్రి! ఎక్కడ తల్లి! అంతా మాయ ఏనుగు మింగిన వెలక్కాయ. ఆం... బైదిబై – ఫర్ యువర్ ఇన్‌ఫర్‌మేషన్. ఊరి బయట ఆశ్రమానికో గుడిసె అద్దెకు తీసుకున్నాను.'

"అద్దెవరు కడతార్రా ?"

"నీ తదనంతరం నేను కడ్తానని రాసిచ్చాను."

పాపారావుకు అరికాలిమంట నెత్తికెక్కింది "నీలాటివాడ్ని కన్నందుకు చెప్పుతో కొట్టుకోవాలిరా!" అంటూ చెప్పు తీసి చేత్తో పట్టుకున్నాడు

"నీలాటివాడికి కొడుకై పుట్టినందుకు నేనే కొట్టుకోవాలి"

"ఏదీ కొట్టుకో !"

"నువ్వేగా ముందుగా అన్నావ్ ? నువ్వే కొట్టుకో ... శంభో శంకర!" అంటూ గోపీ అక్కడ్నుంచి తుర్రుమన్నాడు

కె. వి. సుబ్బారావు, పి. పి. అబ్దుల్లా నిర్మించిన కల్యాణ చిత్ర వారి "అల్లరి వయసు" చిత్రంలో మురళీమోహన్, జగ్గయ్య, జయచిత్ర, రమాప్రభ, కాంతారావు ముఖ్య పాత్రధారులు జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు – జగపతి సంస్థలో అసోసియేట్ డైరెక్టర్‌గా అనుభవం గడించిన రాజశేఖర్ ఈ చిత్రానికి దర్శకత్వం వహించారు.



'గోరింటాకు'లో రమాప్రభ, చలం

## "రాధా కృష్ణయ్య"లో ఆగంతకుని ఎదుట జగడం

బాబూరావు (జె. వి. సోమయాజులు) ఇంటికి కరణం (మొక్కపాటి కృష్ణమోహన్) వచ్చాడు "కూర్చో! ఓ ఎత్తు వేద్దామా ?" అన్నాడు బాబూరావు

"అంతేగద మరి!" అన్నాడు కరణం

"ఊం మొదలెట్టు నాది ఎందుకంటే ఎత్తుకి పైఎత్తు వెయ్యటం మీ కరణాలకే చెల్లింది"

"అదేమిటోగాని, బాబూరావుగారూ! మీ ఇంటికి రాగానే మంచి కాఫీ వాసనొస్తుందండి"

"దానికేం. తెప్పిద్దాం," అంటూ బాబూరావు వెనుతిరిగి "చూడూ! కరణంగారొచ్చారు. రెండు కాఫీలు పంపించు," అన్నాడు. భార్య పాపాయమ్మ (నిర్మల) వస్తూ, "ఇప్పుడు కాఫీలేమిటి ? భోజనం వేళ కావొస్తూంటే. ? కాఫీ, గీఫీ ఏంలేదు." అంది

"లేకపోతే నాకు కోపమొస్తుంది."

"వస్తుందొస్తుంది వస్తే నాకేం భయమా · ప్రతిదానికీ బెదిరించటం ఒకటి నేర్చుకున్నావు"

ఇంతలో కరణం బడ్లు తేలవేసి, "నేను మళ్ళీ కలుస్తాను, బాబూరావూ!" అన్నాడు

"కాఫీ వస్తుంది కూర్చోవయ్యా"

"అబ్బెబ్బె ఎందుకులెండి. మీరేదో కుటుంబ వ్యవహారాల్లో ఉన్నారు. వస్తాను," అంటూ లేచాడు కరణం దాంతో బాబూరావుకి కోపం ఆగింది కాదు. "ఏమిటే నీ ఉద్దేశ్యం ? అహ! ఏమిటి నీ ఉద్దేశ్యం ?" అంటూ భార్య మీదికి పోబోయాడు

"ఏం-మీద మీది కొస్తున్నావ్? కొడతావా ? హాం ఉండు. నీ పని చెప్తా. నర్సమ్మో! ఓ నర్సమ్మో!" అని కేకలెట్టింది పాపాయమ్మ

"ఛారా! ఇందుకా రెండు కొప్పులు ఒక్కచోట చేర్చకూడదనేది ?" అని బాబూరావు నెత్తి బాదుకుంటూ పక్కకు తిరిగేసరికి కరణం లేగు ఎప్పుడో జారుకున్నాడు!

యోగి దర్శకత్వంలో కొత్తా సాంబశివరావు, అనుమాల బాలాజీ చంద్రశేఖర్ నిర్మించిన సుప్రభాతా ఆర్ట్ ప్రొడక్షన్స్ "రాధా కృష్ణయ్య" వర్ణ చిత్రానికి గోపి రచయిత



'కళ్యాణి'లో మురళీమోహన్, జయసుధ

# సినిమా

## "తూర్పు వెళ్ళే రైలు"లో పెళ్ళి చదివింపులు

ఏడు (కొండలు, పెళ్ళి కొడుకు బట్టలు పెట్టాడు భద్రం, పెళ్ళి కుమార్తెకు కుంకుమ బరిణె ఇచ్చాడు శివుడు పాలసీపా ఇచ్చాడు ఉత్తరోత్తరా ఉపయోగార్థం పాలసీపా' అన్నాడు పురోహితుడు

పెళ్ళికొడుకు పెళ్ళికూతురు బంగారి వైపు (కీగంట చూశా ఇంతలో ఆమె అన్న రాము సైకిల్ మీద రయ్యమని వచ్చాడు అతని చేతిలో పటం ఉంది అందరూ అతని వంక చూశారు బంగారి ఆనందంతో మెల్లగా తల ఎత్తింది రాము మైక్ దగ్గరికి వెళ్ళాడు.

"పట్టు బట్టలు నీకు పెట్టలేనమ్మా
అందలా లెక్కించి ఇవ్వలేనమ్మా
గుండె లోతుల మాట
గూడు కట్టిన పాట
పెళ్ళి రోజున నీకు
ఈ అన్న కానుక"

— అంటూ పటంలో తను రాసి తెచ్చిన కవితను చదివి వినిపించాడు

శివుడు పకపకా నవ్వి, "అయిదేళ్ళ కోపాలి కి బడి ఓట్లడిగే నాయకుళ్ళా ఏంట ఈ ఊకదంపుడు? ఇదేమన్నా ఎలక్షన్ మీటింగా? పెళ్ళి పందిరా" అన్నాడు.

అందరూ నవ్వారు

వియ్యపురాలు "తోడబుట్టినవాడు కాసు బంగారమెట్టాలిగాని,పాటలు పద్యాలుకూడుబెట్టునా, సుద్ద పెట్టునా?" అంటూ బుగ్గలు నొక్కుకుంది

రాము (మోహన్) మొహం చిన్నబోయింది మెల్లగా ఆ పటాన్ని చెల్లెలు(సుమంగళి)కి ఇచ్చాడు

బాపు దర్శకత్వంలో పేరాజా నిర్మించిన 'తూర్పువెళ్ళే రైలు" వర్ణచిత్రానికి ముళ్ళపూడి వెంకట రమణ రచయిత ఎస్ పి బాల సుబ్రహ్మణ్యం సంగీత దర్శకుడు ఇషన్ ఆర్య ఛాయాగ్రాహకుడు

## గుండా సత్యనారాయణ సమర్పణలో రెండు చిత్రాలు

"ఖైదీ నెంబర్ 77, కలియుగ మహాభారతం" అనంతరం శ్రీ శక్తి చిత్రవారి "బడాయి బసవయ్య' వర్ణచిత్రాన్ని, శ్రీ శక్తి ఆర్ట్సువారి 'సిరిమల్లె పువ్వు" చిత్రాన్ని గుండా సత్యనారాయణ సమర్పిస్తున్నారు ఈ రెండు చిత్రాల తొలి గీతాలు జూన్ 19న రికార్డు చేయబడ్డాయి

"బడాయి బసవయ్య" చిత్రంలో చంద్ర మోహన్, నూతన్‌ప్రసాద్, పి ఎల్ నారాయణ, సంగీత, జయమాలిని ఆదిగా [illegible] ఉంటారు బోయిన సుబ్బారావు దర్శకుడు పి గోపాలకృష్ణ కథకు పరుచూరి మాటలు రాస్తున్నారు జూలై 20 నుంచి ఆగస్టు 24 వరకు చిత్తూరు పరిసర ప్రాంతాలలో ఔట్‌డోర్ షూటింగ్‌తో చిత్రం పూర్తవుతుంది నిర్వహణ జయప్రసాద్ నిర్మాతలు బి బాపన్నచౌదరి, వి ఎస్ ప్రకాశ రావు సంగీతం చక్రవర్తి

"సిరిమల్లె పువ్వు"లో నూతన్ ప్రసాద్, సంగీత జయమాలిని ఇంతవరకు నిర్ణయింప బడ్డారు రాజాచంద్ర దర్శకుడు కథ పి గోపాలకృష్ణ, మాటలు పరుచూరి సంగీతం సత్యం నిర్వహణ కె పట్టాభిరామయ్య ఈ చిత్ర నిర్మాత బొప్పన సోమేష్‌కు జూన్ 16న సౌ॥ సుధతో విజయవాడలో వివాహం జరిగింది

పై రెండు చిత్రాలకూ ఛాయ, కూర్పు, శిల్పం శాఖలను కె ఎస్ మణి, నాయని మహేశ్వర రావు, రామచంద్రరావు నిర్వహిస్తారు

పి.నాగేంద్ర రావు

సమర్పించు



నవశక్తి పిక్చర్స్




నిర్మాత: పి.నారాయణ రావు దర్శకత్వం: నందమూరి రమేష్

ఆంధ్ర: లక్ష్మీ చిత్ర.. సీడెడ్: ద్వారకా ఫిలింస్.. చిత్తూర్: భారతీ ఫిలింస్.. మైసూరు: అజంతా మూవీస్

## 'శాంతి నివాస్' నివాసం కోసం

''ఎవరది?'' అన్న బాబాయ్ (నాగభూషణం) కేకతో మోహన్ (లక్ష్మీకాంత్), మమత (శశిరేఖ) ఉలిక్కిపడి వెను తిరిగి చూశారు మెట్ల మీద రాక్షసుడిలా నిలుచొనున్న బాబాయ్ ''ఎవరు కావాలి?'' అన్నాడు.

''ఇల్లు కావాలండి,'' అన్నాడు మోహన్ తేరుకుని

''కొంటావా ?''

''కాదండి అద్దెకి ''

''ఇక్కడ ఇల్లుందని మీ కెలా తెల్సింది ?''

''ఎవరో ఒకాయన చెప్పాడండి ''

''బ్రోకర్ గాడా ?''

''అవునండి ''

''ఎంతిచ్చావ్ ?''

''అరవై యండి ''

''గొప్ప పని చేశావ్ అది కూడా నా కిచ్చుంటే- ఇప్పుడైనా సున్నం కొట్టించే వాడ్ని. అద్దె మాట యాభై.''

''బ్రోకర్ మాట అరవై అన్నాడండి ''

''అందుకే వాడ్ని బ్రోకరంటారు బల్బు పోతే మీరే వేసుకోవాలి సున్నం కావాలంటే నేనడక్కూడదు. ఎవరి బక్కెట్ వాళ్ళది ఎవరి కాడు వాళ్ళది నుయ్యి మాత్రం నాది ఇల్లు నాది. ఆ బట్టి రెండు నెలల అద్దె అడ్వాన్సుగా ఇవ్వాలి. కరెంట్ అడ్వాన్స్ యాభై కట్టాలి ఒకటవ తేదీ తెల్లవారు ఝామున అద్దె డబ్బు సిద్ధంగా ఉండాలి ఇల్లు కావాలా ?''

''ఒకసారి చూడనిస్తారండీ ?''

''చూడవలసిన అవసరం ఉండ కూడదు. ఒక సెకన్ దాటితే, అరవై మంది వస్తారు ''

'క్రాంతి'లో రంగనాథ్, జయంతి



కంగారుతో మోహన్ చివాలున వెళ్లి బాబాయ్ చేతిలో డబ్బు ఉంచాడు

ఉదయభాస్కర్, సైదారెడ్డి నిర్మించే ''శాంతి నివాస్'' చిత్రానికి బాబు దర్శకుడు జయశ్రీ రామారావు రచయిత ఇందు ఛాయాగ్రాహకుడు.

## షూటింగ్ పూర్తయిన "మున్సబుగారి అల్లుడు"

''పగను పగతో సాధించలేము ప్రేమతోనూ, వాత్సల్యంతోనూ తొలగదీసుకోవచ్చు చంపదగిన యట్టి శత్రువు తనచేత చిక్కినా కీడు చేయరాదు మేలు చేయాలి ప్రేమించడం నేర్పాలి — అనే ప్రాతిపదికపై మా చిత్రం తయారైంది,'' అన్నారు విజయప్రభ మూవీస్‌వారి ''మున్సబుగారి అల్లుడు'' చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే మాటలు, దర్శకత్వ బాధ్యతలు నిర్వహించిన ఎన్ డి విజయబాబు ఈయన లోగడ ''వధూవరులు'' చిత్ర దర్శకుడుగానేకాక కేంద్ర ప్రభుత్వ బహుమతిని అందుకున్న నాటక రచయితగా కూడా అందరికీ పరిచితుడు ''ప్రధాన పాత్రలో గిరిబాబు, సాత్వికమైన పాత్రలో త్యాగరాజు కనిపించడం ఈ చిత్రంలో మరో విశేషం ఇంకా రావి కొండలరావు, శ్రీగీత, రాణీచంద్ర, శ్రీకళ రాధాకుమారి, చందన, ఇందిర, బేబీ సరళ, సురేంద్రనాథ్‌తో పాటు ఆరుగురు రంగస్థల నటులను కూడా పరిచయం చేస్తున్నాం,'' అన్నారు విజయ్‌బాబు సంగీతం, ఛాయ, కూర్పు, కళ, సహకార దర్శకత్వం శాఖలను బి గోపాలం, బి జనార్దనరావు, బి. కందస్వామి, రంగారావు, సురేంద్రనాథ్ రెడ్డి, భాస్కరరావు నిర్వహించారు లక్ష్మి విజయ్‌బాబు నిర్మాత. నిర్వహణ డాక్టర్ రంగారావు ★

← 'సూపర్‌మాన్'లో ఎన్ టి ఆర్

సినిమా



# వంటలు

## * కరాచీ చాడీ

## క్యాబేజీ పకోడి *

## * కోకోనట్ కేక్



'కుడి ఎడమైతే'..........

కావలసిన వస్తువులు: గోధుమ నూక అరకిలో (2 గ్లాసులు), పంచదార మూడు గ్లాసులు, కిస్మిస్ పళ్ళు ఒక తులము, ఏలకులు అరతులము, మైదాపిండి 2 గ్లాసులు, జీడిపప్పు అరపావు, వేరుశెనగ నూనె అరకిలో

తయారుచేసే విధానము: అరకిలో గోధుమ నూక తీసుకొని పొట్టు లేకుండా శుభ్రపరచి కాలవేసిన మూకుడులో రెండు గరిటెల నెయ్యివేసి గోధుమ నూకను అందులో వేసి బాగా ఎర్రగా వేయించి ఒక పళ్ళెములో వేసుకోవాలి. మైదాపిండి రెండు గ్లాసులు తీసుకొని పూరీల పిండివలె కలిపి ఉంచుకోవాలి. వేయించిన గోధుమ నూకలో పంచదార కలిపి వుంచుకొని మందమైన ఇత్తడి గిన్నెలో మూడు గ్లాసుల నీళ్ళు పోసి, ఎసరు బాగా వస్తున్నప్పుడు పంచదార, నూక మిశ్రమము గిన్నెలో వేసి బాగా కలియబెట్టాలి. బాగా వుడుకుతున్నప్పుడు జీడిపప్పు కిస్మిస్ పళ్ళు వేయాలి. బాగా వుడికిన తర్వాత దింపే ముందుగా ఏలకుల పొడి, రెండు గరిటెల నెయ్యి వేయాలి. దింపి మూతబెట్టి చల్లారబెట్టాలి. దీనిని 'చాడీ' అంటారు. చల్లారిన తర్వాత చాడీని నిమ్మకాయంత ముద్దలుగా చేసుకోవాలి. మూకుడులో నూనె వేసి స్టౌమీద పెట్టాలి. నానిన మైదాపిండిని బాగా మర్దించి చేతికి నూనె రాసుకొని చేతితో వుండను చదిపి చాడీ వుండను అందులో పెట్టి మూసివేయవలెను. దీనిని నూనెలో బొబ్బట్లు వలె వేయించి తింటే చాలా రుచిగ వుంటాయి.

— వెంకట సుబ్బమ్మ

కావలసినవి: క్యాబేజి ఒకటి పెద్దది 1, సెనగపిండి పావు కేజీ, రిఫైండాయిలు పావు లీటరు, గరమ్‌మసాలా దినుసులు 100 గ్రా.

క్యాబేజీ పువ్వును నీటితో కడిగి చిన్నగ తరుక్కోవాలి. సెనగపిండిలో ఈ క్యాబేజీ తరుగును వేసి, నీరుపోసి బాగా కలియబెట్టాలి. ఎక్కువ నీరు పొయ్యకూడదు. మిశ్రమం గరిటె జారుడుగా వుంటే మంచిది. ఇందులో గరమ్‌మసాలా దినుసులు, తగినంత వుప్పు కారాన్ని కలపాలి. రిఫైండాయిల్‌లో బాగా వేయించి తింటే క్యాబేజీ పకోడీలు రుచికరంగా వుంటాయి.

కె. సీతాదేవి

కావలసిన వస్తువులు: లీటరు పాలు, ముదురు కొబ్బరికాయ 1, పంచదార కేజీ, కప్పుమైదా, కప్పునెయ్యి, ఏలకులు 10, జీడిపప్పు 50 గ్రా, మిఠాయిరంగు చిటికెడు

తయారుచేయు విధము: ముందుగ పాలు మీగడ కట్టకుండా కోవా పాకం వచ్చేవరకు కలియబెడుతూ, కొంచెం పాలలో మైదా కలిపి ఆ మరిగిన పాలలో పోసి సన్నని సెగను అరగంటసేపు కలియబెట్టాలి. ఈ పాకంలో కొబ్బరి కోరు పంచదార, మరిగిన నెయ్యి, యాలకులపొడి మిఠాయిరంగు వేసి ఉండపాకం వచ్చేవరకు కలియబెట్టాలి. చేతికి తడి చేసుకుని పాకం అంటకుండ వున్నప్పుడు ఒక స్టీలు పళ్ళెంకు నెయ్యిరాసి ఆ పాకం ముద్దను పళ్ళెంలో పోయాలి. దానిపైన జీడిపప్పు అద్దుకుని వేడిగా వున్నప్పుడే మనకు కావలసిన షేపులో చాకుతో ముక్కలుగా కోసుకోవాలి. ఈ కేకులు చల్లారిన తరువాత ఒక డబ్బాలో వుంచుకుని లంచి టైములో టిఫిన్ క్రింద తింటే చాలా రుచిగా వుంటుంది

— రమణా ప్రకాష్

ఆడుకుంటారు నేను కొత్తకుండలో మంచినీళ్ళు తాగుతూ బంబరలాడే ఫాన్ కింద బాధపడుతుంటాను ''

''అబ్బ, అదికాదండీ ఇప్పుడేకదా మన ఆంధ్రులు ఆవకాయ పెట్టుకొనేది ''

ఈ హ స్త్రం దా ని కి ఇంత ఉపోద్ఘాత మెందుకూ ? – డైరెక్టుగా చెప్తే పోలా ?

''అవును సార్ ! ఆవకాయలు సమ్మర్‌లోనే పెట్టుకుంటారు ''

''ఎగ్జాక్ట్లీ – అన్నట్టు మీరు ఆవకాయ పెట్టుకోటం పూర్తయిందా ?''

''మా ఆవిడ పోరు పడలేక ఆవకాయకు కావలసిన సరుకులు కొనడానికి బజారు కెళ్ళాను సార్ ! ఎండుమిర్చి ఖరీదు విని వళ్ళు మండి ఇంటి కొచ్చేశా సార్— కొనకుండా.''

''ఆం ఖరీదుదేముందీ ? మన ఆంధ్రులలో ఆవకాయ పెట్టుకోనివాళ్ళు చాలా అరుదు ''

ఇంతలో ప్యూన్ కాఫీలు టేబిల్ మీద పెట్టాడు ఆయన ఒక కప్పు అందుకుని తాగుతూ రెండో కప్పు వైపు చూస్తూ అన్నాడు–

''తీసుకోండి చల్లారిపోతుంది ''

వేడి వేడి కాఫీ మెల్లిగా సిప్‌చెయ్యడం మొదలుపెట్టాను 'ఉష్ణం ఉష్ణేన శీతలః' అన్నారుకదా పెద్దలు

''మా శ్రీమతి సంగతి మీకు తెలుసుగా ఇంటి పన్లు ఏం చేతకావు. పైగా నాజూకు మనిషి రేపు మీ ఆవిడ్ని మా శ్రీమతి వద్దకు పంపించండి. కాస్త ఆవకాయ తయారుచెయ్యడానికి సాయపడతారు '' చావు కబురు చల్లగా చెప్పాడు

ఆరి వీడి త స్సా ది య్యా, నా భార్య 'ఆవిడ'నూ, ఆయన భార్య 'శ్రీమతీ'నా ! వాళ్ల శ్రీమతి నాజూకు మ ని షట – నాజూకూ ! మా ఆవిడే కాబోలు మోటు మ ని షి. పైగా ఆవకాయ పెట్టాలిట వాళ్ళావిడకు ఆవకాయ కలిపితే చేతులు మండుతాయిట అవును పాపం నాజూకు మనిషి కాదూ మరి ! ఆవిడ చేతులు మండడం అటుంచి నా వళ్ళు మండింది

''మా ఆవిడ కూడా నాజూకు మనిషేనండి కారాలూ అవీ ప్రతి సంవత్సరం పనిమనిషిచేత దంపించడం, నా చేత కలిపించడంతప్ప తనెప్పుడూ ఆవకాయ కలపదండి నేను కలుపుతూంటే మూనె మాత్రం పోస్తుందండి '' వ్యంగ్యానికి వినయం జోడించి అన్నాను

''అయితే ఇకనేం ? ది ప్రాబ్లెమ్ ఇజ్ సాల్వ్‌డ్ థేంక్‌గాడ్ ''

కొంప ముంచేశాడు ! అంటే నేను వాళ్ళింటి కెళ్ళి ఆవకాయ కలపాలన్నమాట 'ఇంపాజిబుల్ కుదరదు' అని చెప్పేద్దామనుకున్నాను. కాని కాఫీ తాగి ఆబ్లిగేషన్‌లో పడిపోయాను ఏం చెబుదామా అని ఆలోచిస్తుంటే అంతరాయం కలిగిస్తూ అన్నాడాయన –

''కారాలూ అవీ సిద్ధంగా వున్నాయి మీరు చెయ్యవలసిందల్లా కారం, ఉప్పూ, ఆవపొడుం, మామిడికాయ ముక్కలు బాగా కలసేటట్టు కలపడమే మూనె తాయారే పోస్తుందిలెండి యు కెన్ టేక్ టుమారో ఆఫ్ ''

## ఆవకాయరోజులొచ్చాయ్.... ఆవిడేగతి

[ 25వ పేజీ తరువాయి ]

''రేపు సెలవు పెడితే వర్క్ సఫరవుతుందండి.'' ఆవకాయ అవస్థ తప్పించుకోడానికి ప్రయత్నించాను

''మరేం ఫరవాలేదు. రేపు మీ పని కూడా ఆనందరావుకి అంటగట్టేస్తా.''

నేనేం మాట్లాడలేదు. ఏం మాట్లాడనూ? అనవసరంగా కాఫీ తాగి ఆబ్లిగేషన్‌లో పడ్డాను అయినా ఆనందరావు జాతకం కూడా అంతంత మాత్రంగానే ఏడిసింది !

**4**

సాయంత్రం ఇంటి కెళ్ళకుండా తిన్నగా బజారు కెళ్ళాను. మల్లెమొగ్గలూ, కనకాంబరాలూ కలిపి కట్టిన మాల మూడు గజాలు కొన్నాను బొంబే స్వీట్ స్టాల్లో రెండు బాదుషాలూ, మూడు మైసూర్‌పాకులూ, నాలుగు తొక్కుడు మిఠాయిలూ పార్సెల్ చేయించాను నాకు తెలిసిన ఒక బట్టలషాపులో నల్లటి నైలెక్స్ చీర అరువు తీసుకున్నాను. ఈ సరంజామా అంతా రిక్షాలో వేసుకుని ఇంటికి బయలుదేరాను. రిక్షాలో వెడుతుంటే ప్రక్కనున్న పరిసరాలు నాకేం కనపడటంలేదు ఒకే ఆలోచన – ఒకే దృష్టి – ఒకే లక్ష్యం – ఒకే సమస్య. మేనేజరుగారింట్లో ఆవకాయ సమస్య ! నేనాయన ఇంటికెళ్ళి ఆవకాయ కలపడం హాస్యాస్పదంగా తోచింది అప్పటికీ మనస్సుకు నచ్చచెప్పకోడానికి ప్రయత్నించాను తన ఆత్మగౌరవం దెబ్బతింటుందనీ, అది భరించలేననీ నా అంతరాత్మ నాతో ఖచ్చితంగా చెప్పేసింది ఈ పరిస్థితుల్లో మా ఆవిడొకతే నాకు శరణ్యం ఆవిడను మంచిచేసుకోవాలి బ్రతిమాలుకోవాల, ప్రాధేయపడాలి. నా బజారు పనికి అంతరార్థం అదే

మూతి మీద చిరునవ్వు ధరించి ఇంట్లో అడుగు పెట్టాను హాల్లోనూ, ప్రక్క గదులలోనూ ఆవిడ జాడ ఎక్కడా లేదు 'మాణిక్యం' అని మృదువుగా ప్రేమ ఉట్టిపడేటట్టు పిల్చాను ఒక చేత్తో వెదురు విసినకర్ర, ఇంకో చేత్తో అట్లకాడా పట్టుకుని ముక్కుమీద మసితో సిద్ధమైంది నాకు పరిస్థితి అర్థమైపోయింది ముక్కుకి మసిరాసుకొచ్చిన ముదితను చూస్తూ ఒక్కక్షణం నిశ్చేష్టుడనై నిలబడిపోయాను

''ఏం ? అల్లా చూస్తారేం ? – అయినా ఇంత ఆలస్యమైందేం రావడం ?''

నా బుర్ర పనిచెయ్యడం ప్రారంభించింది ఒక్కసారి ఫ్రాయిడ్, జంగ్, ఎల్లిస్ మొదలైన మేధావుల్ని తల్చుకున్నాను వెంటనే మెదడులో మెరుపు మెరిసింది. ఫ్లేటర్, ఫ్లేటర్ – ఫ్లేటర్ హెర్ విమెన్ లైక్ ఫ్లేటరీ !

''నువ్వెంత అందంగా వున్నావు మాణిక్యం ! నీ దివ్యసుందర ముఖారవిందం చూసి పరవశంతో మైమరచి ఉండిపోయాను ఇంత ఆలస్యంగా రావడమంటావా విను చెప్తా చెప్పి నిజం చెప్ప నాకేమున్నా బుద్ధుందంటావా ? అసలు ఉందంటావా అని ''

''ఉందని ఎల్లా అంటాను ? మీకేనాడో చెప్పాను, బుద్ధిలేదని.''

కొంప మునిగింది. నా ప్రయత్నానికి వాతావరణం అనుకూలంగా లేదు మొదట్లోనే పప్పులో కాలేశాను ఇది చాలా క్రూషల్ మూమెంట్. జాగ్రత్తగా ఆలోచించి తూచి మాట్లాడాలి. ఈ ధోరణిలో ఇంకొక్క మాట శ్రీమతి నోటినుంచి వచ్చిందో తాయారమ్మగారి ఆవకాయ నేనే తయారుచెయ్యాలి అందుకని ఉన్న ప్రేమకు మరింత కలిపి ఆ మిశ్రమాన్ని ఒలక పోస్తూ అన్నాను –

''నల్ల నైలెక్స్ చీర కొనిపెట్టమని ఆర్నెల్ల నించి అడుగుతున్నావు బుద్ధున్న మొగుడైతే అన్నిసార్లు అడిగించుకుంటాడా ? ఏ అప్పోసొప్పో చేసి వెంటనే కొనిపారెయ్యడూ ?''

''ఈ వా శే మి టీ, కొత్తగా మాట్లాడుతున్నారూ ? స్నేహితుల నెవరినైనా భోజనానికి పిల్చారా ? ఒకవేళ పిల్చుంటే అదేం కుదర్దు. అసలే తడిబొగ్గులతో తన్నుకొంటున్నాను '' అని వెనుతిరిగి వెళ్ళిపోయింది

అసలే ముక్కుకి మసి రాసుకొచ్చింది అటువంటప్పుడు ఆమెను సమాధానపర్చడం అసంభవం. షెర్లాక్ హోమ్స్ సీరీస్ చదివి వుండడంవల్ల ఆమె ముక్కుమీద మసి ఎట్లా వచ్చి వుంటుందో చెప్తా వినండి 'గాస్' అయిపోయింది అందుకని బొగ్గుల కుంపటి అంటించింది ఖర్మం చాలక తడిబొగ్గులవడంవల్ల ఎంత కిర్సనాయిలు పోసినా కుంపటి రాజుకుని వుండదు విసనకర్రతో ఎంత విసిరినా పొగ తప్ప ఫలితం కనిపించివుండదు. తద్ఫలితంగా కళ్ళ నుండి ముక్కున్నుంట నీరు కారివుంటుంది అప్పుడామె బొగ్గులు పోసిన మసిచేత్తో ముక్కు చీదుకునివుంటుంది చూశారా నాదెంత సూక్ష్మ బుద్ధో. అయినా మా ఆవిడ నాకు బుద్ధిలేదని ఏనాడో చెప్పిందిట ! టు హెల్ విత్ ది బ్లడీ వైఫ్

త్వరగా ఆఫీసు బట్టలు విడిచేసి లుంగీ కట్టుకుని వంటింట్లోకెళ్ళాను వెళ్లక ఏంచెయ్యనూ ? విరమించడానికి వీలులేనిది నా ప్రయత్నం

''చూడు మాణిక్యం, నువ్వు కోమలాంగివి బొగ్గుల కుంపటితో బాధపడలేవు వంట నేను చేస్తా కాని నువ్వెళ్ళి శుభ్రంగా స్నానం చేసిరా'' అన్నాను, స్నానం చేస్తే చల్లబడుతుందనే ఆశతో

భార్యారత్నం నావైపు అదోలా చూసి అక్కడ నించి మెల్లగా జారుకుంది శుభ శకునం, 'హమ్మయ్య' అని ఒక్కసారి నిట్టూర్చి కుంపటితో కుస్తీపట్టడం మొదలుపెట్టాను వంట ముగిశాక మా అమ్మ కోడలికి కొత్త చీర కట్టబెట్టాను పూలచెండు తల్లో తురిమాను దగ్గరుండి భోజనం చేయించాను ఆ తతంగం ముగిశాక మాణిక్యాన్ని తిన్నగా తీసుకెళ్ళి నిలువుటద్దంముందు నిలబెట్టి అడిగాను

PUBLISHED SIMULTANEOUSLY FROM VIJAYAWADA & HYDERABAD

# ఆంధ్రపత్రిక

FOUNDER: DESODDHARAKA K. NAGESWARA RAO

కొన్ని ఆకర్షణలు

మా ఊరి సమస్య








అరణ్య కాండ

మన సినిమాలు

ఇది నారీ దృక్పథం





మద్రాసు సినీ డైరీ

విజయవాడ సినిమా వార్తలు

గ్రంథ సమీక్షలు



వారఫలాలు

డాక్టర్ కబుర్లు

ప్రేక్షకుల తీర్పు

ఆయుర్వేద సుభాషితాలు

నమ్మదగిన వార్తలకి, నిజాయితీ కల వ్యాఖ్యలకి ఆంధ్రపత్రిక



అమరశిల్పి జక్కన్న మహోన్నవిగా పేర్కొంచిన బేలూరు (కర్నాటక)లోని దేవాలయ శిల్ప సౌందర్యం. —ఫొటో : వి.యస్.వి. ప్రసాద్

“నువ్వు నిజంగా నా భార్యవేనా లేక దివినుండి దిగివచ్చిన దేవతవా ?”

“పొగడ్తలకేంకాని మీకేంకావాలో చెబుదురూ చెప్పక.”

“నువ్వు దేవతవి -- నువ్వే కావాలి.”

“అవును. నేను దేవతనే -- భర్త(ర్త)క్తా ఏమి నీ కోరిక ?”

‘మహాప్రసాదము నీవు మా బాస్ గృహంబునకుం జని తద్గృహిణికి ‘ఆవకాయ’ అనంబడు కార్యంబునకు గర్తృత్వము వహించి నన్ను ధన్యునిగావింపుము దేవీ !”

“ఏమిటీ ? మీ బాస్ పెళ్ళానికి నేను ఆవకాయ పెట్టాలా ?”

“పెట్టుటయన సంపూర్ణముగా పెట్టనవసరంబులేదు. కారంబుల్ మొదలైనవి మర్దించబడి చూర్ణము గావించబడియుండును. రసాలములు తరుగబడియుండును. దేవి తన కుసుమకోమల హస్తముంచే వాటిని గలిపిన జాలును.” వెధవది ఎవరన్నా కాస్త గ్రాంధికం వందిస్తే చాలు నా కదేపనిగా గ్రాంధికమే వచ్చేస్తుంది. ఏం చెయ్యను ?

“అయితేమాత్రం, నా చేతులు మండవా యేం ?”

“సందేహించకుము దేవీ! తైలంబున్ వాయూరే బోయును.”

“ఓరీ బుద్ధిహీనుడా! తైలముం బోసినంత మాత్రాన హస్తములు మండునురా ? కారము తినిన మండునుకాని ”

చూశారా, చూశారా కొత్త చీర కట్టుకుని గ్రాంధికంలో ఎట్లా తిడుతోందో! తప్పదు భరించా బరించాను బుజ్జగించాను. బతిమలాడాను, ప్రాధేయపడ్డాను – ప్రార్థించాను. చివరికి ఒంటిగంటకు ఒక్కసారి ఆవ...చి–

“సరేలెండి” అనేసి అటు తిరిగి పడుకుంది.

నా ఆనందాన్ని నేను వర్ణించలేను. చేతనైతే మీరు వూహించుకోండి

## ఆవకాయరోజుల్లోచ్చాంయ్ ...
## ఆవిడే గతి

### 5

“సార్, పిలుస్తున్నారు సార్ !”

“ఎవరు ? .. ఆఁ బాస్ కదూ, వస్తున్నా నద ”

గదిలో అడుగు పెట్టానోలేదో —

“వాట్ ది డె విల్ డజ్ దిస్ మీన్ ? ఐ” అస్కుడ్ యు టు టేక్ టు డే ఆఫ్ – డిడిన్ట్ ఐ ?

“యు డిడ్ సర్”

“దెన్ వై షడ్ యు అప్పియ హియ ఇన్ ఆల్ ఫ్లెష్ అండ్ బ్లడ్ ? -- గెట్ ది హెల్ ..”

“... ... అదికాదు సార్...”

“ఏది కాదూ ? గెట్ ది హెల్ ఔటాఫ్ హియ అండ్ అటెండ్ టు మై ఆవకాయ - ఐ మీన్ పికిల్స్”

“అదికాదు సా..”

“నథింగ్ డూయింగ్, యు గె...”

“అట్లాగే వెడతాను. ఒక్క మాట వినండి సార్”

“ఔట్ విదిట్.”

“మా శ్రీమతి మీ ఆవిడగారి దగ్గరకు వెడతారు సార్.”

“అదా సంగతి. వన్ మోర్ ప్రాబ్లెమ్ ఇజ్ సాల్వ్డ్. థేంక్యూ థేంక్యూ ఐ మీన్ థేంక్ యువర్ లైఫ్ – డిడ్ యు రిఫర్ టు మై వైఫ్ ఏజ్ ‘ఆవిడ’ ?”

“డిడై సర్ ?”

“ఓ గాడ్, దటీజ్ వాటయామ్ ఆస్కింగ్యూ”

“ఇఫై డిడ్ అయామ్ సారీ సర్ వాట్ఐ మీన్... మీ శ్రీమతి మా ఆవిడ సర్ ”

“వ్హాట్ !”

“అదే సర్. మీ శ్రీమతి మా ఆవిడ. అంటే మీ భార్య శ్రీమతి. నా భార్య ఆవిడ.”

“దట్సిట్. దటీజ్ ది వే యు షడ్ రిఫర్ టు అవర్ వైవ్స్.”

వీడి ఇంగ్లీషు తగలడా ! ఉచ్చారణ మాత్రం సీమదొరలని అనుకరిస్తాడు. ‘అవర్ వైవ్స్’ అనకపోతే ‘అవర్ రెస్పెక్టివ్ వైవ్స్’ అని ఏడవకూడదూ ?

### 6

మర్నాడు సాయంత్రం ఆఫీసునుంచి ఇంటికి వెళ్ళేటప్పటికి ఇల్లు తాళంవేసి వుంది. అంటే ఇంకా ఆవిడ తాయారమ్మగారితో తంటాలు పడుతోందన్నమాట. తాళంచెవి పక్కవాటా పంతులమ్మ కిచ్చిందేమోనని వెళ్ళి అడిగితే లేదంది పంతులమ్మ. ఇంతలో గుమ్మం ముందు మా బాస్ కారాగింది. మాణిక్యంతో బాటు రెండు జాడీలు కూడా కార్లోంచి దిగడం చూసి ఆశ్చర్యపోయాను

“ఏమిటి సంగతి ? -- అటునించి వస్తున్నారు ?”

“అబ్బే తాళంచెవి అక్కడిచ్చావేమోనని అడిగొచ్చా అంతే.”

“ఆ అవకాశం మీకు కలిగిస్తానని యెల్లా అనుకున్నారూ ? – ఎప్పుడైనా ఏ పరిస్థితుల్లోనైనా ఎవరికైనా తాళంచెవి ఇచ్చి వెళ్ళవలసివస్తే ఎదురింటి బామ్మగారికి యిచ్చి వెడతా. బాగా జ్ఞాపకం వుంచుకోండి.”

ఈ ఆడవాళ్ళంతా ఇంతే. ఉత్త అనుమానం మనుషులు. అయినా అపర శ్రీరామచంద్రుడినైన నన్ను గూర్చి ఆవిడ ఆవిధంగా అనుమానపడటం నాకేమీ నచ్చలేదు. మరొకప్పుడైతే మంచి ‘రిటార్డ్’ యిచ్చివుందును. అప్పుడుమాత్రం ఆవకాయ జాడీల ముఖాలు చూసి మా ఇంటావిడను క్షమించేశాను.

ఆరాత్రి తక్కిన ఆధరువులు ముట్టుకోకుండా ఆవకాయతోటే అన్నంతినడం సాగించాను. ఆవకాయ బ్రహ్మాండంగా వుంది. అయినా రెండు గంటల పనికి రెండు జాడీల ఆవకాయ కమీషన్ కొట్టడం నాకేం నచ్చలేదు.

“ఏదో శాంపుల్‌కి కాస్త ఆవకాయ తీసుకుంటే పరవాలేదు కాని మరీ రెండు

జాడలా! నాకేం నచ్చలా — ముక్కు ఊరలేదు కాని కాస్త పెండి వడ్డించు''

''అవును, మీకెందుకు నచ్చుతుందీ? తినడమైతే రెట్టింపన్నం తింటారు ఆవకాయతో — అయినా నేనేం అడిగానా ఏమన్నానా? వద్దు వద్దు అంటుంటే వినకుండా కార్లో పెట్టించేసింది. ఒక జాడీ మామూలు ఆవకాయ — రెండోది ఉల్లావకాయ.''

''అవును పాపం. నువ్వు మాత్రం ఏంచేస్తావ్ ఆవిడ బలవంతపెడితే — ఏదీ కాస్త అన్నం పెట్టి ఉల్లావకాయ కూడా కాస్త రుచి చూపించు చూద్దాం.''

ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ కాస్తకు మరికాస్త వడ్డించింది ఘుమఘుమలాడే ఉల్లావకాయ.

స్త్రీ జాతికి ఒక ప్రత్యేకత వుంది. వాళ్లందరికీ స్వతహాగా కొంత మనస్తత్వ శాస్త్రం తెలిసి వుంటుంది. అనుకూలమైన సమయం కనిపెట్టి బైట పెడతారు వాళ్ల కోర్కెల్ని.

''ఆవకాయ ఖర్చు నాలుగు వందలు మిగిల్చాను మీకు. ఆ నాలుగు వందలూ పెట్టి కంచిపట్టు చీర కొనిపెట్టండి. పాతికో పరకో పైనపడినా సందేహించకండేం - ఇదుగో మిమ్మల్నే.''

నాకు పలకమారి ఘాటైన ఆవకాయతో కలిసిన ఒక మెతుకు ముక్కులోకి వచ్చి చచ్చినంత

## ఆవకాయరోజులొచ్చాయ్.... ఆపిడేగతి

పనైంది. రెండు గ్లాసుల మంచినీళ్లు తాగి మూడుసార్లు నెత్తి బాదుకుని కాస్త తేరుకుని అన్నాను —

''మొన్ననేకదా నీకు నల్ల నైలెక్స్ చీర కొన్నాను. వచ్చే ఆవకాయ సీజన్లో తప్పక కంచిపట్టు చీర కొంటాను — సరేనా.''

## 7

ఇది జరిగి సంవత్సరం కావస్తోంది. రెండు జాడీల ఆవకాయా తొమ్మిదినెలల్లో ఆరగించేశాం. ఈ రెండ్నెల్ల పైచిలుకూ ఆవకాయలేక ఆరాటపడిపోతున్నాం — ముఖ్యంగా నేను! ఈ ఏడు తాయారమ్మ దయ — మా ప్రాప్తి!

మర్నాడు ఆఫీసులో ఇష్టదైవాన్ని ప్రార్థిస్తూ కూర్చున్నా.

''సార్, పిలుస్తున్నారు సార్!''

ఎవరని అడక్కుండానే మేనేజర్ గదిలోకి దారితీశా. లోపల వాతావరణం అనుకూలంగా వుంది.

''నిలబడ్డారేం? కూర్చోండి.'' వెంకయ్యగారి ఆహ్వానం.

బ్రతుకుజీవుడా అని కుర్చీలో కూలబడ్డాను

''ఇది ఏ సీజన్''

'ఆవకాయ సీజన్' అనబోయి బలవంతాన ఆపుకుని అన్నా —

''సమ్మర్ సర్!''

''యు కెన్ టేక్ టుమారో ఆఫ్ అండర్స్టాండ్?''

''అవసరంలేదండి. నిరుడు...''

''ఏమిటవసరంలేదు? ఆవకాయ అవసరంలేని ఆంధ్రుడెవడండీ? ఆవకాయంటే నేను చెవి కోసుకుంటాను. తాయారు ముక్కూ, చెవులూ రెండూ కోసేసుకుంటుంది.'' ఆయన జోక్కి ఆయనే నవ్వుకుంటూ అన్నాడు.

''అదికాదు సార్...''

''ఏదికాదు?''

''అదే సర్, నిరుడు మా శ్రీమతి మీ ఆవిడ...''

''వ్హాట్?!''

''నిరుడు మా ఆవిడ మీ శ్రీమతిగార్కి హెల్ప్ చేసింది సార్ — ఆవకాయ విషయంలో అందువల్ల నేను శలవుపెట్టటం అనవసరం సార్.''

''ఆఁ అవునవును రేపు మీ ఆవిడను మా శ్రీమతి వద్దకు పంపండి — అండ్ డోంట్ ఫర్గెట్ టు కన్వే మై థాంక్స్ టు హెర్.''

మూడురోజులు తిరక్కుండా మాణిక్యం మంచి కంచిపట్టుచీర కొనుక్కుంది!

# బలహీనత

శారీరకంగా బలం లేకపోవడం బలహీనత అని అందరమూ అనుకొంటాము. అంతకంటె మానసికమైన బలహీనతయే పెద్ద బలహీనత. వాస్తవమైన బలహీనత అదే అని చెప్పవచ్చు. కొందరు వ్యక్తులు దుర్బలులైనా ఉన్నా మనో ధైర్యం వల్ల సాహసం వల్ల గొప్ప బలవంతులకు కూడా సాధ్యంకాని కార్యాలు సాధించగలుగుతారు. ఎంతో బలవంతులైనా, ఎలాటి కార్యాన్నైనా సాధించగలిగే సామర్థ్యం ఉన్నా కొందరికి పిరికితనం ఉంటుంది. అది బలహీనతయే! అట్టి బలవంతుడు ఏలాటి కార్యాన్నీ సాధించలేడు. కొందరు బలశాలులకు పిరికి తనం లేకపోవచ్చు అట్టి వారి హృదయం మెత్తగా ఉండడమూ బలహీనతయే. మెత్తదనంవల్ల పేరు ప్రతిష్ఠలు దెబ్బతింటాయని పెద్దలు చెప్పి ఉన్నారు.

"అంకాది రోపిత మృగ
శ్చంద్రమా మృగలాంఛనః,
కేసరీ నిష్ఠురాక్షిప్త
మృగయూథో మృగాధిపః,"

అభిమానించి, ముద్దుచేసి లేడిని తొడ మీద కూర్చోబెట్టుకొన్న చంద్రుడు 'మృగలాంఛనుడు' అని చెడ్డ పేరు తెచ్చుకున్నాడు.




అది అతనికి దోషరూపమైన కళంకం అయింది. అడవిలోని మృగాలనన్నింటినీ చీల్చి చెండాడుతూ భయంకరంగా ఉండే సింహం "మృగాధిపతి" అని ప్రశంసను పొందింది అందువల్ల మెత్తదనం పనికిరాదు. అది బలహీనత అవుతుంది. "మెత్తని వాణ్ణి చూస్తే మొత్తబుద్ధి" అని సామెత ఉన్నదికదా!

అయితే, అందరిమీదాను కఠినంగా ఉండాలని అనుకోకూడదు. అతి మెత్తదనం వల్ల ప్రజలకు లోకువ అయిపోయే అవకాశం ఉన్నది. కాబట్టి దానికి చోటివ్వకూడదు. బలహీనతను స్ఫురింపజేసే సాత్త్వికభావం ఉన్నా గాంభీర్యాన్ని విడిచిపెట్టకూడదు. ఈ విషయాన్ని వివరిస్తూ శ్రీరామకృష్ణ పరమహంస చెప్పిన ఒక చిన్న కథ ఉన్నది. ఒక యోగి ఉపదేశం వల్ల ఒక సర్పం శాంతమూర్తియై ఉన్నదట! దారిని పోయే వాళ్ళు దాని శాంతి స్వభావాన్ని చూచి పెక్కు విధాల హింసించేవారట! మరొకసారి ఆ యోగి వచ్చి దానిని చూచి, దాని దీనత్వానికి కారణం అడిగి, సంగతి తెలుసుకున్నాడట! అతడు "ఇతరులను కరవవద్దనీ, శాంతంగా ఉండవలెననీ చెప్పియున్నాను కాని, పడగ యెత్తి బుసకొట్టవద్దని చెప్పలేదే! బలహీనత అని ప్రజలకు తోస్తే, అది మనకు బాధనే కలిగిస్తుంది" అని అన్నాడట!

మూర్ఖతమైన స్వభావం మానవుని బలహీనతనే వెల్లడి చేస్తుంది. అది లోకువకు కారణం.

---

కిటికీలోంచి ఓసారి చూసి తుర్రుమన్నాడు. చారుకి పోపు పెడుతున్న వరలక్ష్మి గరిటెను జారవిడిచి పరుగెత్తుకొచ్చింది...

"...నెమ్మదిగా పిలవలేరూ. కొంప అంటుకున్నట్టు ఏమిటాకేకలు" అంటూ.

"నేనొకటి అడుగుతాను...జాగ్రత్తగా విని, ఆలోచించి మరీ సమాధానం చెప్పు."

"ఇదేమిటి రచనలతోబాటు 'లా' కూడా ప్రాక్టీసు చేస్తున్నారా" కోపం—దానంతా వెటకారం.

"హేళనగా వుందేమిటే నీకు ... విను. ఓ భార్యా భర్తా యిద్దరు పిల్లలుగల ఓ స్మాల్ స్కేల్ సంసారంలో భర్త రచయిత. మామూలు అల్లాటప్పా రచయిత కాదు. గొప్ప రచయిత. కాని, అదృష్టం బావుండక అతను వ్రాసిందేదీ అచ్చుకు నోచుకోలేదు. ఇక భార్య విసుక్కోవడమేకాని ఏ విధమైన చేయూతనీ యివ్వలేదు. సరికదా ఆదరకమైన ఏవగింపు, యిటువంటివేమీ

## అప్పారావూ ఆత్మహత్య

(14వ పేజీ తరువాయి)

యిష్టం లేనట్టు. కానీ ఆవిడే మరో రచయితననిపించుకుంటూ పత్రికకు ఉత్తరాలు. ఏమిటి సంబంధం... ? అప్పుడా భర్త ఏం చేయాలి?"

"చాలా బావుంది...తర్వాత ఏం చేద్దామనుకుంటున్నారు. కథ ముగింపును చేరుకోలేదా. ఈ సారి కొత్త పత్రికకి పంపండి. వేసుకోవచ్చు."

"ఏమే తల తిరుగుతుందేమిటే...యిది మీ భాగవతమే"

"ఓహో.. అంటే జరుగుతున్న కథ. అందులోనూ వుద్దేశించి వ్రాసిందన్నమాట. అలా వ్రాయటం తప్పుకాదుటండీ" చిత్రంగా అడిగింది.

"ఏం పిచ్చిగాని పట్టిందేమిటే. యిది చూడు" అంటూ పత్రిక ముఖం మీదికి విసిరికొట్టాడు.

తను వ్రాసింది చూపింది. "ఏముందిందులో నే వ్రాసిన ఉత్తరం" నవ్వింది.

"నువ్వు వ్రాసిందే సంబరపడిపోనక్కర్లేదు. భర్తను అవమానపరచడానికి, అతనిలోని కళాతృష్ణను చంపేయడానికి" ఆవేశం ప్రతిధ్వనించింది.

"నాకు తెలియకడుగుతాను. మీరెందుకసలు అలా పేలతారు. మిమ్మల్ని ఎప్పుడు డిస్కరేజ్ చేయలేదు. 'యిలా వ్రాస్తే బావుంటుంది' అని సలహా యిస్తే, "ఏడ చెప్పవే బోడి సలహా" అంటారు. 'యిలా వ్రాయండని ఛీఫ్ చెబితే' "నువ్వుచెప్పింది వ్రాస్తే ఇక నా గొప్పతనమేమి"టంటారు. అందుకే మీ గురించి పట్టించుకోవడం పూర్తిగా మానేశాను." వున్నది వున్నట్టు చెప్పింది.

"నానేసి ఆ శ్రద్ధ మరొకడిమీద చూపిస్తున్నావన్నమాట."

"అక్కడే పొరబడుతున్నారు. మరొకడి మీద కాదు... మరొకరి రచన మీద."

"ఏదైనా ఒకటే"

"ఎలా అవుతుంది ... యిన్ని కథలు వ్రాస్తారు. ఈ మాత్రం ఆలోచన లేకపోతే ఎలాగండీ."

అప్పారావుకి మండిపోయింది.

"మాటకి మాట బాగా అప్పచెప్తావు; పిసినారివెధవా ఏమిటి"

"అవ మీరు ఈ పదేళ్ళ కాపురంలో చూపించిన నాలుగు సినిమాలూ చూపి ... చిని ఆ కథల మీద చూపించే శ్రద్ధలో కొంతైనా నామీద చూపిస్తే నే సుఖపడే దాన్ని."

"అంటే యిప్పుడు కష్టపడుతున్నావంటావు ... నాదగ్గర అంతకష్టపడి ఏం వుండక్కర్లేదు ... గెటౌవుట్. మీ అమ్మ దగ్గరికి పో మళ్ళీ నా కథ పడ్డాకే నిన్ను తీసుకొచ్చేది-" ఖచ్చితంగా చెప్పేశాడు.

బ్రతిమాలుకున్నా వినలేదు ... చివరగా పిల్లలిద్దర్నీ ఎత్తుకుని వెడుతూ "కాస్త ఆలోచించండి" అంది బాధగా.

"ఆలోచనా జ్ఞానం లేదని నువ్వే అన్నావుగా" మొండిగా మొండెంలేని మాటవిసిరాడు.

వెళ్ళిపోతూ అంది వరలక్ష్మి, "ఏమండీ ఒక్క విషయం గుర్తుంచుకోండి. రచనలు చేసేటప్పుడు నావే బావున్నాయి అనే అహాన్ని చంపుకోవాలి. కథ పడాలి అన్న

# అప్పారావూ ఆత్మహత్య

పట్టుదల అవసరం.. సిరా తడి ఆరకముందే రచనలు పంపడం మంచిది కాదు" వెళ్తున్నానని చెప్పేసి పిల్లల్ని తీసుకుని వెళ్ళిపోయింది.

వరలక్ష్మి అప్పారావుతో ఏం తీసిపోదు. చదువులో అప్పారావు గ్రాడ్యుయేషన్ చేశాడు. వరం చదువులో ఇంటరు. జీవితంలో యిద్దరు పిల్లలతోటి పులుస్టాప్ పెట్టేసింది. వచ్చిన వుత్తరాల్ని కూడా భర్త వద్దనేసరికి మానేసింది. తను మాట్లాడే ప్రతిమాటా భర్త తీసిపారే యడంతో 'కోపం' కట్టలు తెంచుకుంది. అప్పారావు కథలు వ్రాస్తాడన్న మాటేగానీ బాహ్యప్రపంచం గురించి వరానికి తెలిసిన దాంట్లో సగం కూడా తెలియదు నిజానికి.

వరలక్ష్మి వెళ్ళిపోయింది. మూడు రోజుల తరువాత వుత్తరం వచ్చింది. 'ఎలా వున్నారు...హోటల్ భోజనం చేయకండి. ఆరోగ్యం దెబ్బతింటుంది. పిల్లలు అస్తమానం 'నాన్నా నాన్నా' అంటున్నారు. చాకలి బట్టలు తీసికెళ్ళాడు. తెచ్చాడా... వెంటనే జవాబు వ్రాస్తారు కదూ' ఎంతో ప్రేమతో వ్రాసిన ఆ వుత్తరంలో రచనల విషయం వ్రాసిందా...? అందుకే అప్పారావు ఆ వుత్తరం తనని వెక్కిరిస్తున్నట్లు అపోహపడ్డాడు. వ్రాస్తే ఏం తప్పుగా భావిస్తాడోనని వరలక్ష్మి వ్రాయలేదు. వ్రాయలేదనేదే తప్పుగా తీసుకున్నాడు అప్పారావు.

ఆఫీసరు శలవు పెట్టాడు. దాంతో, తను సంతకం మాత్రం పెట్టి వచ్చేశాడు. మధ్యాహ్నం పోస్ట్‌మాన్ కేక విని వీధి గుమ్మంలోకి పరిగెత్తుకొచ్చాడు. ప్రతిసారీ కవరందించే పోస్ట్‌మాన్ ఈసారి వెరైటీ చూపించాడు... ఈసారి కార్డిచ్చాడు. ఎర్త్ పిక్చర్ చూపినట్లు ఫీలయ్యాడు... పత్రిక నుంచి. మీరు పంపిన 'మబ్బులు తొలిగాయి' కథానిక ప్రచురణకు స్వీకరించామని తెలుపుటకు సంతోషిస్తున్నాం. వీలున బట్టి ప్రచురిస్తాం. దీనిపై ఎటువంటి వుత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు —యిట్లు సంపాదకుడు.

మబ్బులు తొలిగడం... యిదెప్పుడు వ్రాశానబ్బా. చిత్రంగా వుందే పొరపాటున నే పంపిన కథేదైనా పేరుగానీ మార్చలేదు కదా... అది వ్రాయాలిగా మరి. కథపడుతున్నందుకు సంతోషంగానే వుంది... ఏదో ధ్యాసగా వుండి కార్డును అలా వెనక్కి తిప్పాడు. అది తన కథకాదు... వరలక్ష్మిది. కోపంతో విసిరిన కార్డు క్రింద పడలేదు... మంచంమీద పడింది.

తనని యిన్సల్ట్ చేయడానికే వరలక్ష్మి ఈపని చేసింది మాటవరసకైనా తనతో చెప్పిందా... భర్తనే విలువ నిచ్చిందా. అందుకే తనకి కోపం. ఆలోచిస్తూ వుండగానే నిద్ర పట్టేసింది 'తన కథలన్నీ వెనక్కొస్తున్నట్లు... పోస్ట్‌మాన్ విసుక్కుంటున్నట్లు, వరలక్ష్మివి వరుసగ పడి పెద్ద రచయిత్రి అయినట్లు... నువ్వు రచయిత వవుతాననుకుంటే కథ అడ్డం తిరిగిందే స్నేహితులన్నట్లు' చేదైన కల వద్దంటున్నా వచ్చి అప్పారావుని మరింత కంగారు పెట్టేసింది.

ఇప్పుడు అప్పారావుకి జీవితంమీద విరక్తి కలిగింది. వింటిన చెప్పు పట్టుకొని పాట పాడలేదు... టేబుల్‌మీద స్లీపింగ్ పిల్స్ దగ్గరికి వెళ్ళాడు త్రాగుదామని. అందులో పిల్స్ లేకుండా పోలేను... 'ఎందుకీ బ్రతుకు... ఆత్మహత్య శరణ్యం' తన భార్య మరో కథ వ్రాయకముందే తను చావాలి. లేకపోతే మరింత అవమానానికి లోను కావల్సి వుంటుంది. ఆ విషయమే తన బెస్ట్ ఫ్రెండ్ రమణతో అంటే "తగా. సిగ్గులేదు" అన్నాడు. ఆ సమయంలో తన దగ్గర జేబు రుమాలు ఉండబట్టి సరిపోయింది.

తను వ్రాసిన యింకో కథ కూడా తిరి



గొవ్వేసిం తర్వాత ఆత్మహత్య తప్పదనుకున్నాడు... ఎలా చేసుకోవాలి. రోడ్డుమీద పోతున్న కారుక్రింద పడితే సరి. కేసు యితరులమీదికి రాకుండా జేబులో ఓ చీటీ. తరువాత అది చూసి ఎవరు నవ్వితేమాత్రం తనకేం?... తనుండడుగా...

ఉదయం పది గంటల సమయంలో మెయిన్‌రోడ్ మీద వేగంగా వస్తున్న కారు ముందు కురికాడు. "ఏం చావాలని వుందా. నిరుద్యోగివా. వెనుకబడిన తరగతి వాడివి కాలేదనా. ఇలా మా కార్ల క్రింద పడి చావాలనుకుంటే నువ్వు చచ్చినా, చావకపోయినా కేసు పీక్కోలేక మేం చావాలి. చావడానికి యింకా చాలా మార్గాలున్నాయి" కష్టం మీదకారు నాపిన వ్యక్తి కారు దిగి ముఖం వాచేటట్లు చివాట్లేశాడు. తలకాయ వంచుకుని వెళ్ళి పోయాడు.

ఎదురింటి సరోజతో అక్రమ సంబంధమున్నట్లు నటిస్తే... అందుకు కారణం లేకపోలేదు. సరోజా, శివరావులు కొత్తగా పెళ్ళయినవారు. సరోజకేసి ఎవరైనా కన్నెత్తి చూసినా ఆ రోజు యుద్ధమే... మొన్ననే ఎవడో కాలేజీ స్టూడెంట్ అటుగా వెడుతూ గుమ్మంలో నిలబడిన సరోజకేసి చూడటం, కన్ను కొట్టడం లాంటి దేదో చేసేయడంతో, కనిపెట్టిన అతగాడు వాడి దవడల్లో మార్పు తేవడమే కాకుండా కుంటేట్లు చేసి భార్యకు వార్నింగిచ్చేశాడు "గుమ్మంలో నిలబడద్దని"— ఇక యిప్పుడు తను కనుక వెళ్ళి బలవంతం చేస్తున్నట్లు నటిస్తే వాడొచ్చి చంపేయడం ఖాయం. ఆ విధంగా ఛస్తే సరి అని డిసైడ్ చేసేసుకున్నాడు.

గుండె దడదడలాడినా, తలుపు టకటకలాడించాడు. సరోజ తలుపు తీసింది. అంతే కాదు. ఎందుకు, ఏమిటి అనే ప్రశ్న వేయకుండా, ఓ బ్రాడ్ స్మైల్ పడేసి తలుపు గడియ వేసేసింది. అప్పారావంటే సరోజకి ఎంతో యిష్టం. అది కాకుండా ఎప్పుడూ చక్కని క్రాపులో వుండే అప్పారావు భార్యా బిడ్డలు లేక ఒంటరిగా వున్నాడు కాబట్టి ఎలాగైనా తనే చొరవచేసుకుని మాట్లాడా లనుకుంది. ఈ విషయం భర్తకు తెలిస్తే... భయపడి వూరుకుంది.

అర్థంకాని చూపులు కొన్నింటిని అటుయిటూ విసిరేశాడు.

"భయపడతారెందుకు. ఆయన ఈ రాత్రి రారులేండి. ఊరెళ్లారు" అంది అసభ్యంగా ప్రవర్తిస్తూ...'ఇదేమిటి ఖర్మ. నే ననుకున్న దొకటి జరుగుతున్న దొకటి. బలవంతం చేద్దామని వెళ్ళి, శీలం పాడుచేసుకుని రానుకదా...' అనుకుంటూ విదిలించుకుని కంగారు కంగారుగా యింట్లోకొచ్చి తలుపేసుకున్నాడు.

చావడానికి కూడా అదృష్టం వుండాలేమో .. లేకపోతే ఏమిటిది. తను చేసే ప్రతి ప్రయత్నం విఫలమౌతోంది

ఈసారి అప్పారావుకి వురి తీసుకోవాలనే 'ఆలోచన' డాట్సన్‌లో వచ్చినా తిథి–వార– నక్షత్రాలు చూశాడు.

ఒ. కే. అనుకుని, అటకమీద దుమ్ముపట్టివున్న చంటాడి ఉయ్యాలతాడును దులిపి, దూలానికి వేసి, క్రింద ఓ స్టూలేసుకుని సిద్ధమయ్యాడు... భార్యా బిడ్డల్ని ఓసారి తలుచుకున్నాడు. అదేమిటో ఛద్దామనుకుంటున్నప్పుడల్లా వారిమీద ప్రేమ

అధికమవుతోంది. అయినా తన ప్రయత్నం మాత్రం విరమించదలుచుకోలేదు. గోడ కుండే భగత్‌సింగ్ క్యాలెండరు "పిరికివాడా.. బ్రతికి సాధించరా" అంటున్నట్లుగా వుంది, గాలికెగురుతున్న కారణంగా.

"ఆఁ మీరంతా అలాగే అంటారు...నా బాధ మీకేం తెలుస్తుంది" తన నిర్ణయానికే ఓటేసుకున్నాడు.

త్రాడులో మెడకాయ దూర్చగానే తలుపు తట్టిన శబ్దం... పోస్ట్‌మానేమో. శుభవార్త తెచ్చాడేమో... కాకపోతే ఎలాగో మళ్ళీ యిదే... మనచేతుల్లో వున్నదేగా అనుకుని తలుపు తీశాడు.

అద్దె అడగడానికని యింటాయన వచ్చేశాడు లోపలికి.

"ఏమిటండీ ఆ త్రాడు ... అదీనూ" నిముషంలో నిజం కనిపెట్టేశాడు.

"అద్దె అవసరం లేదులెండి" అన్నాడు వస్త్రాలోంచి తీసి వందనిస్తున్న అప్పారావుతో.

"అదేమిటండీ" తెల్లముఖం వేసి.

"అవును మీరింకా వుంటే తీసుకుంటాం. వుండరుగా. అడ్వాన్స్ ఎలాగూ వుంది."

"ఏమిటండీ మీరంటున్నది ... అర్థం కావటంలేదు."

"మీ సంగతి నాకర్థం కావటంలేదు... ఏమిటది...చావడానికి నా కొంపే దొరికిందా ... ఈ యింట్లో చచ్చి మరొకరిని రాకుండా చేయాలనేగా..." చదామడా

# అప్పారావూ ఆత్మహత్య

చివాట్లేసి, వారంలో ఖాళీ చేయాలనే వార్నింగిచ్చేసి వెళ్ళిపోయాడు అక్కడ్నుంచి.

బాధతో పైకీ- క్రిందకీ చూసి ఒక నిర్ణయానికొచ్చేశాడు.

తాళంవేసి పెళ్ళాం – పిల్లలదగ్గరకి ఆ రోజే బయలుదేరాడు. అందరూ మొదట్లో కొద్దిగా కోపం చూపినా తరువాత వచ్చినందుకు అంతా సంతోషించారు.

"ఏమండీ కథ గానీ పడిందా... యిలా వచ్చారు" అందామనుకుని బాధపెట్టినట్టవుతుందని అనలేదు వరలక్ష్మి

టేబుల్ మీద కొత్త పత్రికను చూడాలనిపించక పోయినా చూశాడు. వరలక్ష్మి వ్రాసిన కథ కనిపించింది. 'చదవద్దు' తనమకున్నాడు అక్కడెవరూ లేరు.

"ఏం వ్రాసిందో చదువు" మనసంది.

కథ చదివేశాడు ... భార్యాభర్తలిద్దరికీ పడదు. రచయిత కావాలనుకున్న భర్త రచనలు పడకపోవటమూ, ఏ వుద్దేశ్యమూ లేని భార్య రచయిత్రిగా గుర్తించబడటం, చివరికి యిద్దరి మధ్యా వున్న అసూయపు తెరలు తొలగిపోయి కలిసి రచనలు చేయటం. కథ ఒకరిదైతే, కథనం మరొకరిది అలా... అదీ సారాంశం. చాలా బాగా వ్రాసింది. పేజీలలాగే తిరగేస్తున్నాడు. 'నిరాశ' కథ క్రింద తన పేరుండడంతో ఆశ్చర్యపోయి చదివేశాడు.

తనా కథని వ్రాయనేలేదే అసలు. మరేమిటిది. తన పేరుగల మరోవ్యక్తి అయివుండచ్చుగా. ఈ లోపులో చివరి పేజీలో 'సవరణ' అని వుండి, 'నిరాశ' క్రింద నిరాశ కథారచయిత మందు రాంబాబు అని చదువుకో ప్రార్థన. అచ్చుపొరపాటుకు చింతిస్తున్నాం!'

–అంతవరకూ తన తెల్లచొక్కాలా మాసిపోయివున్న 'చావాలన్న కోరిక' మళ్ళీ మొగ్గతొడిగింది. ఇంతకంటే అవమానం మరొకటుంటుందా? ఛీ ఛీ వెధవ బతుకు... కాసేపు చీదరించుకున్నాడు.... కాసేపటికి అలమరలో రేడియో ప్రక్కగా వున్న నల్లని మందు పై తన దృష్టి పడింది. దాని క్రింద 'పాయిజన్' అన్నది చూడంగానే పరీక్షలో తప్పి సప్లిమెంటరీ వ్రాస్తున్న విద్యార్థిలా అయి బాటిల్ మొత్తం 'స్వాహా' చేశాడు.

'రుచి'కి అప్పారావు ఆశ్చర్యపోయాడు.

వరలక్ష్మి అప్పారావుని చూసి నవ్వాపుకోలేక పోయింది.... "అదేమిటండీ చంటి పిల్లాడిలా తేనెను త్రాగేస్తున్నారు" అంది.

"ఏమిటీ తే...నే..." అన్నాడు.

"అవును. మామూలు సీసాల్లో పోస్తే పిల్లలు కావాలని ఏడుస్తున్నారని కడిగి ఆ సీసాలో పోశాను. దానిమీద బొమ్మల్ని చూసైనా భయపడి అడగరని."

ఈ సారి తన కోరిక తీరలేదు.

ఒకవేళ నిజంగా విషమే అయితే తనే మయ్యేవాడు, మూడు ప్రాణాలకి అన్యాయం చేసినవాడయ్యేవాడు. వరలక్ష్మికి యింకా తనింత పిరికివాడని, సిగ్గుమాలిన ప్రయత్నాలు చేశాడని తెలియదు ..తెలియకూడదు కూడా...

ఆత్మహత్య చేసుకోవాలన్న అప్పారావు కోరికే ఆత్మహత్య చేసుకుంది.

'నిరాశ' మనిషి అభివృద్ధికి అటంకమవుతుంది. నిజమే. కానీ, ఆశను పెంచుకుని 'ప్రయత్నం'లో ముందుకు సాగాలి! సత్యాన్ని గ్రహించాడు.

తన తప్పు తెలుసుకుని సిగ్గుపడ్డాడు.

ఎదురుగా నిలుచున్న వరలక్ష్మి కేసి అదోలా చూశాడు.

ఇద్దరూ ఒకటయ్యారు.

అదేం చిత్రమోగానీ వరలక్ష్మి భర్తమీద గౌరవంతో అతని పేరు పెట్టి వ్రాసిన వింత గొప్పకథైనా తిరిగొచ్చేయడం మొదలైంది...

ఇద్దరూ కలిసి 'పెన్ నేమ్' కోసం ఆలోచనల్లో పడ్డారు... ◉



## హైదరాబాద్ నోట్‌బుక్

—తిరుమల రామచంద్ర

### రాష్ట్రంలో రాజకీయాలు !

"వానరాకడ—ప్రాణంపోకడ" తెలియదనిసామెత. దీనిని రాజకీయాల పోకడకు అన్వయించవచ్చు. ఇందిర కాంగ్రెస్ పర్వతంతో ఢీ కొన్న దేవరాజ అరసు మేషం తల పగులకపోగా పర్వతాన్ని పెకల్చుకొని అవతలికి దూసుకొని పోయి మరొక మందకు నాయకత్వం వహించడంతో రాష్ట్రంలో తత్సమానభావాలుగల వారిలో సంచలనం కలుగడం సహజం. ఎవరు పిల్లికి గంటకడుతారా! అని కాచుకూర్చున్న వారు, ఎవరు ముందు చేయిఎత్తితే, ఎవరుముందు గొంతెత్తితే వారివెంబడడం లోకంలో మనం చూస్తున్నదే. రాష్ట్రంలోని సహభావుకులందరూ అరసు వైపు మొగ్గడం కనిపిస్తున్నది. అప్పుడే శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణ పదారుమంది కాంగ్రెస్ పార్లమెంటు సభ్యులతో వస్తానని అరసుతో అన్నారట.

ఇందిరాకాంగ్రెస్‌లోని అసంతృప్తులు అరసు వెంట పడుతున్నందుకు కలగుండుపడిన కొందరు అరసును మీర్‌జాఫర్‌తో పోల్చితే, వారు వీరందరినీ ఇందిరా గులాములని ఎత్తిపొడుస్తున్నారు. ఈ వాగ్యుద్ధం ఇలా కొనసాగుతుండగా, పార్లమెంటు సభ్యులలో సగం మంది అరసువైపు, మొగ్గడంతో 'రాష్ట్ర రాజకీయ పక్షాలలోను చాల చీలికలు వస్తాయని కొందరు ఆందోళనపడగా, 'అప్పుడు మాకు ప్రత్యేక రాష్ట్రాందోళన ఆయుధం వుండనేవుంది' అని కొందరన్నారు. జనాన్ని మసిపూసి మారేడు కాయచేయడానికి ఎన్ని రాజకీయ మాయలులేవు ? అని ఒక వృద్ధనాయకుడు ప్రశ్నించాడు. ఏదిఏమైనా, గురుడు సింహంలో ప్రవేశించేవేళకు దేశంలో కొత్తమార్పులు వస్తాయని, ఒక జ్యోతిశ్శాస్త్ర పారంగతుడుఅన్నాడు.

### నోటు బుక్కులు :

విద్యావిధానంలో మార్పులు రావడంతో (అంటే వ్యాపారదోరణి ప్రవేశించడంతో) కొత్త సమస్యలు ఉత్పన్నమయ్యాయి. పూర్వం మననానికి ప్రాధాన్యం. చదివిన కొంతభాగాన్ని మననం చేసుకునే వారు. ఇప్పుడు చదవడం, వ్రాయడం ముఖ్యం. దానితో కాయితాలకు గిరాకీ ఏర్పడింది. బడికిపోయే చిన్న పసికూనలు ఒక్కొ విషయానికి రెండు నోటుపుస్తకాల వంతున మోసుకుని పోతుంటే, భావిసంసార భారవహనానికి ఇది ట్రయినింగా? —అనిపిస్తుంది. పాఠ్యపుస్తకాలు దొరకని సమస్య అలా వుండగా, నోటుబుక్కుల కరువు విపరీతమయింది. జంటనగరాలలో ఎంచక్కా పెద్దలు పుస్తకాల దుకాణాల ముందు బారులు తీరినిలబడడం చూస్తే, బస్సుల లోను, ఇతరత్రాను ఈ మాత్రం క్రమశిక్షణ పాటిస్తే, ఎంత బాగుండును? అని అనిపిస్తుంది. ఈ క్యూలో వారు కూడ గంటలకొలది కాపలావేస్తే గాని నాల్గింతల ధరకు నోటుబుక్కులు దొరకవు. జంటనగరాలలోని 871 పాఠశాలలకు ఇండెంట్ల ప్రకారం రాష్ట్రవాణిజ్యసంస్థ నోటుపుస్తకాలు కేటాయించినా, అవి సగం పాఠశాలలకు కూడా చేరలేదు. పెద్ద పాఠశాలల పరిస్థితే ఇలా ఉన్నప్పుడు, రాష్ట్రం మొత్తంమీద ఏకోపాధ్యాయ పాఠశాలలతో సహా ఉన్న 46,557 పాఠశాలలలో చదివే 65 లక్షలమందికి రాష్ట్రవాణిజ్యసంస్థ నోటుపుస్తకాలు అందేదెప్పుడో ?! వారి భాగ్యమెట్లున్నదో!

### ఉపశ్రుతి :

గేయ సుందరకాండ ఆవిష్కరణోత్సవంలో ప్రసంగించిన వారిలో పలువురు సుందరకాండ అని సుందర శబ్దాన్ని దీర్ఘంతో ఉచ్చరించారే, సాధువేనా? అనడిగాడు నా పక్కనున్న ఒక శ్రోత. కిష్కింధాకాండ, అయోధ్యాకాండ అని వున్నప్పుడు, సుందరాకాండ అని ఎందుకనకూడదు? — అని ఎదురు ప్రశ్నవేశారు మరొక శ్రోత. దీనినే రాభణమాత్ర మంటారు అని ఒక పండితుడు తీర్పు చెప్పారు. కుంభకర్ణునితో భకారం వుంది, విభీషణునిలో భకారం వుంది. రాక్షసకుల శ్రేష్ఠుడైన వాడు రాభణుడు కాక, రావణుడవుతాడా? — అని భోజకాళిదాస కథలలో శ్లోకం వుంది. దానిని రాభణ మాత్రమంటారు— అని ఆ పండితుడు వివరించాడు. ●









# 30 లక్షల డాలర్ల వజ్రం!

ప్రపంచ విఖ్యాత నటి ఎలిజబెత్ టేలర్ తనకు ఒకనాటి తన భర్త రిచర్డ్ బర్టన్ అలనాడు బహూకరించిన వజ్రాన్ని న్యూయార్క్‌లోని ఒక వజ్రాల వ్యాపారికి 30 లక్షల డాలర్లకు అమ్మిందట. ఈ వజ్రం తన కమ్మవుని గత రెండేళ్ళుగా ఆమెను ప్రార్థిస్తూనే ఉన్నట్లు ఆ వజ్రాల వ్యాపారి హెన్రీ లాంబర్ట్ అన్నారట. ఈ వజ్రం 70 కారట్ల బరువుండి, 58 ముఖాలతో ఉన్నదట. ప్రపంచంలోని వజ్రాలలోనే ఇది అపురూపమైన వజ్రమట.

# మతిలేని వారు?

మన భారతదేశంలో వున్న జనాభాలో కనీసం వెయ్యికి ఇరవయ్యారు మందికైనా చిత్తభ్రమణం వున్నదని లెక్కలు కట్టి తేల్చారట అఖండ మేధావులు. ఈ శాతంలో కనీసం 25 శాతం మేరకైనా ఆహారం సరిగాలేక, విటమినులు ఒంటికి చేరక పిచ్చి స్థితికి గురైనవారేనట.

## బస్‌కి బలైన పెళ్ళికూతురు

పాండిచ్చేరికి చెందిన తిరుక్కనూరులో వో పెళ్లివారు రెండెడ్ల బండిలో పెళ్లి కూతురు 17 ఏళ్ల కుప్పమ్మతో పెళ్లికి బయలుదేరి వెళ్తుండగా వో బస్సు ఆ బండిని గుద్దిందట. ఆ గుద్దుతో కుప్పమ్మ ఎగిరి క్రింద పడటం, ఆమె మీంచి బస్సు పోవడం, ఆమె నలిగి, రక్తపు మడుగులో విలవిల్లాడి చనిపోవడం త్రుటి కాలంలో జరిగి పట్లు జరిగిందట.

## ఆత్మహత్యకి దారితీసిన దారిద్ర్యం!

కాన్పూరుకు చెందిన కైలాష్ మిల్స్ మూతపడడంతో కొన్ని వందలమంది పనివారు నిరాశ్రయులై పోయారట. చాలా కుటుంబాలు సర్వనాశనమై పోయాయట. మహేష్ సింగ్ అనే 47 ఏళ్ళాయన యీ మిల్స్‌లో స్పిన్నింగ్ సెక్షన్‌లో సూపర్‌వైజర్‌గా పనిచేసేవాడట. తన కుటుంబాన్ని గాక తన తల్లిదండ్రులను, నలుగురు చెల్లెళ్లను, ఒక తమ్ముడిని ఈయన తన జీతంలోనే పోషించేవాడట. పర్యవసానంగా ఉద్యోగం పోయి, నిత్యం గడవడమే కష్టమై ఇంట్లో ఏమీ లేని వైనం భార్యతో విని విని విసుగెత్తి దీనికి ఫైనల్‌గా వో మార్గం ఆలోచిస్తున్నాను అని భార్యతో అని, ఆ రాత్రి విషం త్రాగి ఆత్మహత్య చేసుకున్నాడటా మహేష్ సింగ్. ఇలాంటి మహేష్ సింగులీ పవిత్ర భారతదేశంలో మరెందరో!

## గిడ్డంగులలోని గోధుమలు మాయం!

కరువు కాటకాలతో బాధపడే బీద ప్రజలకు పంచి పెట్టడానికిగాను 12 లక్షలు పోసి 800 టన్నుల గోధుమలు మణిపూర్ ప్రభుత్వం కొని, గిడ్డంగులలో దాస్తే, ఆ ఎనిమిదొందల టన్నులూ మటుమాయమై పోయాయట. దిమాపూర్ గిడ్డంగులలో దాచబడ్డాయనీ, ఆ 800 టన్నుల గోధుమలూ ఇప్పుడు ఆ గిడ్డంగులలో లేవనీనిగుల్ కోహావో అనే ఆయన పత్రికా విలేఖరులకు ప్రకటించారట. ఆయన పబ్లిక్‌వర్క్స్ అండ్ ఎగ్రికల్చరల్ శాఖకు పార్లమెంటరీ సెక్రెటరీ గారట— కాకి వచ్చి రోకలి మింగిందని చెప్పిన డెమొక్రటిక్ సెటప్‌లో అదెలా సాధ్యం అని ప్రశ్నించరాదు. అవునా!!

## పొట్టేలుపై ఫిర్యాదు!

తన తప్పు ఏమీ లేకుండా తన మీదకు వచ్చి తనని కుమ్మి కుమ్మి గాయం చేసిందని వో గొర్రె పొట్టేలు మీద కొట్వా అనే వూరిలోని ప్రజలు పోలీసుకు ఫిర్యాదు చేస్తే వారు ఆ గొర్రె పొట్టేల్ని అరెస్టు చేసి, న్యాయం ముందుంచారట. ఈ కేసు విచారణ చేసిన ఎడిషనల్ కలెక్టరు ఆర్ కరణ్ అగర్వాల్‌గారు పునః విచారణ జరిగేవరకూ ఆ జంతువును మునిసిపల్ కమిటీకి చెందిన జంతు జైలులో పెట్టమని ఆజ్ఞ జారీ చేశారట.

## "వింకో" నిర్ణయం!

భారతదేశంలో కావాల్సిన అగ్గిపెట్టెలలో సుమారు ముప్ఫయి శాతం తయారు చేసే ప్రఖ్యాత "విమ్‌కో" ఫ్యాక్టరీలు మూసివేయాలని ఆ కంపెనీవారు నిర్ణయించుకున్నారట. ఈ ఫ్యాక్టరీలు కలకత్తాలోనూ, మద్రాసులోనూ వున్నాయట. సుమారు రెండు వేల మంది కార్మికులిందులో పని చేస్తున్నారట. అవలెందుకు ఆ సొంతదార్లకు మూసివేయాలనే వూహ వచ్చిందని ప్రశ్నిస్తే, దీనికి చరణ్‌సింగ్‌గారే కారణమన్నారట. ఆయన యంత్రాల సాయంతో అగ్గిపెట్టెలు తయారు చేసే ఫ్యాక్టరీల మీద పన్నులు భారంగా వేసేశారట. అన్నీ చేతితోనే చెయ్యాలని, యంత్రాలతో జరిగే పనులను అంగీకరించరాదని ఆయన వుద్దేశమో! మరయితే కారూ, రైలూ, విమానం యంత్రాలతో పనిచేసేవి కదా! ఎంచక్కా ఎడ్లబండో, గుర్రబ్బండో ఎక్కి చల్ చల్ పాట పాడుకుంటూ పోతేపోలా!

# భ్రమరపంచకం

కాళీపట్నం సీతావసంతలక్ష్మి



పెద్ద కథ

వాన కురిసి కురిసి నాలుగురోజుల అనంతరం ఆరోజే వెలిసింది.

వీధి వరండాలో కూర్చుని "టైమ్స్ ఆఫ్ ఇండియా" లోని వాంటెడ్ కాలమ్స్ శ్రద్ధగా పరికిస్తున్న క్రిష్ణవేణి "పోస్ట్" అన్న కేకకు ఉలిక్కిపడకుండానే తలెత్తింది. రోజూ ఈ కేక కోసం ఒళ్ళంతా చెవులు చేసుకుని ఎదురు చూస్తోందాయె మరి. గుండెల్లో కొద్దిగ ఆత్రుత. గబుక్కున పడక్కుర్చీ లోంచి లేచి ఉత్తరం అందుకుంది. కవర్ మీద బాంక్ ఎంబ్లెమ్. దడ దడ లాడే గుండెల్తో, కొద్దిగ వణికే చేతులతో ఉత్తరం బయటికి తీసి గబగబా చదివింది. తనకు బాంక్‌లో ఉద్యోగం వచ్చింది. ఒక్క విసురు ఎగిరి గంతేసి వంటింట్లోకి వెళింది.

"మమ్మీ! నాకు రమా వాళ్ళన్న పని చేస్తున్న బాంక్‌లో ఉద్యోగం వచ్చింది. మొత్తం ఐదువందలొస్తుంది డి. ఏ తో సహా. మమ్మీ ఉద్యోగం వదలకూడదు" అంటూ గారాలు పోతూ వివరించింది తల్లికి వేడికోలుగా.

"ఒక ప్రక్కనించి పెళ్ళి సంబంధాలు వస్తూంటే మధ్యలో ఉద్యోగమంటావేమిటి క్రిష్ణా! కాస్త ఆలోచించు. నువ్వా చిన్న పిల్లవు కాదు కదా! అయినా నాన్నగారిని కూడా రానీ అప్పుడు చూద్దాం. ఏంతా? పదకొండున్నరయిందా? ఒంటిగంటకి మీ డాడీ వస్తారుగదా!" కామేశ్వరి కూతుర్ని వారించింది.

"అదికాదు మమ్మీ! ఈ జాబ్ వేరే ఊళ్ళోనయినా కాదు. ఉన్న ఊళ్ళో, తెలిసిన వారి మధ్య భయమేమీ ఉండదు మమ్మీ" క్రిష్ణ దీర్ఘం తీసింది.

"ఏమోనే క్రిష్ణా! మీ నాన్నగార్ని రానీ చూదాం" కామేశ్వరి దాటేసింది.

"అయితే ఈలోగా నేనోసారి రమా వాళ్ళింటి కెళ్ళొస్తా" అంటూ చెప్పేది వినకుండా చెప్పు లేసుకుని, చరచరా బైటకు నడిచింది క్రిష్ణవేణి.

క్రిష్ణవేణి తెల్లగా, బొమ్మలా ఉంటుంది. పేరుకు తగ్గట్టు పెద్ద బారెడు జడ. వాలుజడ వేసుకుంటుంది. మరీ చక్రాలంతేసి కాకపోయినా విశాలమయిన కళ్ళు, ఆమె కనుబొమల మధ్య ఒక గీత గీస్తే బాణంలా ఉంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే అందమయినది. క్రిష్ణవేణి తండ్రి ఆ ఊరిలోనే ఉన్న ఒక ఫ్యాక్టరీలో ఇంజనీరు. ఫ్యాక్టరీ ఆవరణ లోని క్వార్టర్సులో నివాసం. ఎమ్మే పాసయిన క్రిష్ణవేణి ఆధునిక భావాలు గల ఇరవయి రెండేండ్ల యువతి. మొత్తానికెలా అయితేనేమి తల్లితండ్రులను ఒప్పించి, ఉద్యోగంలో చేరడాని కనుమతి సంపాదించింది. కానీ ఒక్కషరతు మీద - తనకు వివాహం నిశ్చయం కాగానే మానేసేటట్లు.

బాంక్ కాస్త దూరమే. క్రిష్ణవేణి తండ్రి శర్మగారు మొదటిరోజు కారు తీసుకొని వెళ్ళమన్నారు. తరువాత 26 వ నంబరు బస్సు తిన్నగా బాంకి దగ్గరే ఆగుతుందని తెలుసుకుని దాంట్లోకి ఒక సీజన్ టిక్కెట్టు తీసుకుంది క్రిష్ణవేణి. మొదటిరోజు క్రిష్ణవేణి కింకా బాగా జ్ఞాపకం. బ్రాంచి మేనేజరు ప్రభాకరరావు రమా వాళ్ళన్నయ్యే. కుటుంబ పరిచయ మింతకు ముందునుంచీ ఉన్నా ప్రస్తుతం తనకు బాస్ అయ్యేడుగనుక కాస్త బెరుకుగానే అనిపించింది. అతను నలభయి ఐదేండ్ల బ్రహ్మచారి. రమ అతని ఆఖరు చెల్లెలు. బియ్యేవరకు క్రిష్ణవేణి క్లాస్‌మేట్. అప్పుడే పెళ్ళి కుదిరింది, తండ్రి లేని రమకు.

ఆరోజు ఉదయం కరక్టుగా 10 గంటలకు బాంకిలో హాజరయింది క్రిష్ణవేణి. కారులో వచ్చిన ఈ క్లర్కు ఎవరా అని

ఆశ్చర్యపోతున్న సహోద్యోగులందరికీ ప్రభాకర్రావు ఒక్కొక్కడిగా టోకున పరిచయం చేసేశాడు.

"క్రిష్ణవేణి అని మన ఆఫీసులో సుశీల సీట్లోకి క్రొత్తగా చేరింది. మారను లేదూ! అదీ ఇదీ బియ్యేదాకా కలిసే చదివారు. దానికి పెళ్ళి కుదిరింది, దీని కింకా లేదు! అంతే తే—." ఈ పరిచయానికి క్రిష్ణవేణి విస్తుపోయింది. తనని తనన్నయ్య కూడా 'అది' 'ఇది' 'ఏమే' 'ఒసే' అని అనడు. మరి ఇతనెమిటి? ఊం! పోన్లే. ఏదో పెద్దవాడు. మొదటి సారి తన కన్న వింతో పెద్దవాడు అయిన ప్రభాకర్రావు చేత అలా పిలిపించుకోవటం ఏ మాత్రం ఇష్టంలేదనే సంగతి, అతని దగ్గరెలా బయట పెట్టాలో తెలియక సతమత మయింది.

"ఇదిగో!" ఉలిక్కిపడింది. "అలా దిక్కులు చూస్తావేమిటి? ఇతను చక్రవర్తి, ఈతడు బాపూజీ, అదేలే మన నేత. అసలు పేరు బాబూరావు — నీ ప్రక్కసీటే. వీళ్ళదరినీ. ఈ పెద మనిషి విద్యాసాగర్ మన కాషియర్. రామకిష్టా! వెళ్ళి అందరికీ 'జ్యోతి' నుండి కాఫీలు తీసుకురా. నీవూ తీసుకో." అని ప్యూనుకు పురమాయించి "ఈ దెబ్బకి వాడిని కూడా పరిచయం చేశేశాను క్రిష్ణవేణికి" అని చిన్నపిల వాడిలా నవ్వాడు ప్రభాకర్రావు బట్టతలని చేత్తో రాసుకుంటూ. చేతులు జోడించి అందరికీ నమస్కారం చేసింది.

అంతా నిలబడే కాఫీ త్రాగరు. రామకృష్ణతో వచ్చిన 'జ్యోతి' సర్వరు కప్పులు, డబ్బులు తీసుకొని వెళి పోయాడు.

# భ్రమర పంచకం

ప్రభాకర్రావు క్రిష్ణవేణిని తన ఆఫీసు గది లోనికి పిలిచి 'కూర్చో'మని పని గురించి వివరించాడు.

అంతా అయ్యాక "చూడు! మన బ్రాంచి చిన్నది. ఇందులో పని చేసేది మనమైదుగురమే! ఇదొక చిన్న కుటుంబం లాంటిదనుకో. కలిసి మెలిసి పన్చేసుకు పోవాలి. అందుకనే బాధ్యతలను-విడగొట్టి పంచలేదు నేను. దీనివల్లపని అప్పుడప్పుడు కాస్త ఎక్కువా తక్కువా ఉంటుంది. సర్దుకుపోవాల్సొస్తుంది. ఎలా చెప్పావో మరి. ఏమిటో ఇంటో నీడపట్టు నుండాల్సిన ఆడపిల్లలు ఉద్యోగాల కోసం ఎగబట్టం! "నిట్యూర్చాడు" ఏం బావు కుందామనే?"

అదిగో! మళ్ళీ ఏమే అంటాడు. అలా అనకుండా ఉంటే బాగుండును.

"ఇంట్లో ఏం తోచటం లేదండీ! అందుకని" వినయంగా జవాబు చెప్పింది క్రిష్ణవేణి అలా మొదలయింది ఆమె ఆఫీసు జీవితం.

* * *

ఆ రోజు ఆఫీసుమంది కస్టమర్సు లేరు. క్రిష్ణవేణి సీరియస్‌గా లెడ్జరు బుక్కులో పెద్దదొకదాన్లో ఎంట్రీలు చేస్తోంది.

"నమస్కారం" చక్కటి కంఠం విని తలెత్తింది. "చెక్‌బుక్ తేవడం మరిచాను. విత్‌డ్రా చేయడమెలా?"

"పాస్ బుక్కుందా?"

"లేదు. అది కూడా తే లేదు. విడ్రాచేయడం వీలవదా?"

"ఏజంటుగారి నడిగొస్తానుండండి మీ ఎకౌంటు నంబరూ, మీపేరూ చెప్పండి."

పేరు చెప్పడానికెందుకో ఒక్కక్షణం సందేహించి "వాసు అని చెప్పండి. అకౌంటు నంబరు 695."

క్రిష్ణవేణి ప్రభాకర్రావు రూము కెడుతూంటే అతని చూపులు తనని వెంటాడుతున్న అనుభూతి కలిగింది.

"వాసేనా! ఫరవాలేదులే పాస్‌బుక్కు లేకపోయినా. విడ్రాయల్ ఫారంమీద తీసుకో మను" అని ఒక చిరునవ్వు పారేసి తిరిగి తన పనిలో నిమగ్నమయ్యాడు ప్రభాకర్రావు.

ఫారంమీద సంతకం, ఎకౌంటు నంబరూ చెక్ చేసి మరో లెడ్జరులో పెట్టి ఏజెంటు గారి సంతకానికి పంపింది. ఇంతలో శ్రీనివాసులు మాట కలిపాడు.

"మీరిక్కడ కొత్తగా చేరినట్టున్నారే. అయినా ఈ సీటులో కొచ్చారెందుకు? అదేం విచిత్రమో ఇందులో కెవరొచ్చినా అట్టే రోజులుండరు. ఆడపిల్లయితే పెళ్ళి, మగవాడయితే మరో ఉద్యోగమో లేక ట్రాన్స్ఫరో‌ను. నా ఉద్దేశ్యం మీరుండ కూడదని కాదు సుమాండి."

అతని మాటకారి తనానికి నవ్వొచ్చింది. తనూ కలకాలం ఉండాలనుకోవటం లేదుగా. పైకి మందహాసం చేసింది.

"మీ టోకెన్ తీసుకోండి శ్రీనివాసులు గారూ" అని మాత్రం అంది

"వాసూ అనండి చాలు" సవరించాడు.

వాసు టోకెన్ తీసుకుని కాషియరుండే కాబిన్ వైపు నడచాడు. బాపూజీ క్రిష్ణవేణితో మెల్లిగా గొణిగినట్టన్నాడు.

"భలే వదుల్చుకున్నారండీ! మాటలు మొదలు పెడితే ఆపడు గురుడు" అంటూ మళ్ళీ పని చూసుకోవడం మొదలు పెట్టాడు.

వాసుని చూసి బాపూజీ అసూయ చెందడం సహజం. కొద్దో గొప్పో కమల హాసన్ పోలికలున్న వాసు 'అలంకరణంతా ఆ యాక్టరు లాగే చేసుకుంటాడు. అతడు వేసుకున్న ముదురు నీలం బెల్ బాటం దాంట్లో టక్ చేయబడిన లేతనీలం మీద చిన్న ప్రింటున్న ఫుల్‌హాండ్స్ షర్టూ దానిమీద వెడల్పు బెల్టు మీద పెద్ద వీస్ అనే అక్షరమున్న బకిల్ కొట్టొచ్చినట్టు కనబడుతూ ఆకర్షణీయంగా ఉంటాడు వాసు. మెడ దిగుతూన్న వంకుల జుట్టూ, చంద్రవంకను బోర్లించినట్టున్న గుబురు మీసాలూ కలిగిన వాసు ఆడపిల్లలు కోరుకునే స్వప్నసుందరుడిలాగే ఉంటాడు. బాపూజీకి వేమీలేవు మరి. ఎప్పుడూ సాదాగా తెల్లని ఖద్దరు పాంటు, షర్టు వేసుకుంటాడు. క్లోజ్ క్రాప్. మనిషి ఎక్కువగా పొడుగు లేకపోయినా, కొద్దిగా బల్లగా ఉండి బలంగా కనిపిస్తాడు. క్రింది పలువరుసలో ముందు రెండు పళ్ళూ టెన్నిస్ ఆడుతూ పోగొట్టుకున్నానంటాడు. అతని అసలు పేరు బాబూరావు. ఖద్దరు తప్ప మరోటి కట్టనందువల్ల అందరూ అతన్ని వేళాకోళానికి బాపూజీ అని పిలవటం మొదలు పెట్టారు. కాని చివరికదే అతని పేరుగా స్థిరపడి పోయింది. నలభయి సంవత్సరాల బాపూజీకి ఇలా పిలిపించుకోవటం, తద్వారా సంక్రమించిన పాపులారిటీ అంటే చాలా ఇష్టం. అయినా వాసుని చూస్తే కంటకం. అందులోనూ క్రిష్ణవేణితో పరిచయం పెంచుకోవడానికి వాసు పడుతున్న తాపత్రయం చూస్తే మంటగా ఉంది. ప్రక్కసీటు యువంత మాత్రాన బాపూజీ క్రిష్ణవేణి స్నేహం కబుర్లు తన వొక్కడి సొత్తవ్వాలని కోరుకున్నాడు. పైకి తొణకక్కపోయినా మనసులో ముల్లు గుచ్చుకున్నట్టు బాధ పడుతున్నాడీమధ్య.

* * *

ఆరోజు ముప్పయ్యవతారీఖు క్రిష్ణవేణి మొదటి నెలజీతం అందుకో బోతోంది. మనసులో ఉల్లాసం. రవికీ, కామేశ్వరమ్మకూ, తండ్రికీ బహుమతులేమయినా కొనాలి. ఏంకొంటే బాగుంటుందనే మీమాంసలో పడింది. ఆ రోజు అంచవర్లు ఆ మాటే అంది.

అందరూ వారి వారి టిఫిన్స్ బల మీద పెట్టుకొని తింటున్నారు. క్రిష్ణవేణి రోజూ మూడు పరోటాలు, కూరా చిన్న డబ్బాలో పెట్టి తెచ్చుకుంటుంది. ఆ రోజు కామేశ్వరమ్మ బంగాళాదుంపల కూరా చేసిచ్చింది. బాపూజీ "జ్యోతి" నుండి వచ్చిన మసాలాదోసె పార్సెల్ విప్పాడు. సాగర్ కారియర్ విప్పి పూర్తి భోజనం మొదలు పెట్టాడు. ఇంటి నుండి మనిషి వచ్చి ఇస్తాడు—కారియర్ భోజనం, విస్తరి, మరచెంబుతో నీళ్ళతో సహా. చక్రవర్తి మధ్యాహ్నాలు టీ తప్ప మరేమీ పుచ్చుకోడు. మసాలా పార్సెల్‌తో టీ టీలూ వచ్చాయి.

"ఏమయినా ప్రెజెంట్స్ కొనాలండీ! ఏంకొనాలో తెలియటంలేదు. మా యింటో అందరికీ అన్నీ ఉన్నాయి" అంది పరాటా నోట్లో పెట్టుకో బోతూ క్రిష్ణవేణి.

"మీ నాన్నగారికి కఫ్‌లింక్స్, టైపిన్ సెట్ కొనండి. మీ అన్నకు టై కొనండి, మీ అమ్మగారికి సింపుల్. ఆడవాళ్ళ మనసుకి చీరకన్న దగ్గరేముంది?" ఇది సాగర్ వుద్దేశ్యం.

"అందరికీ బట్టలే కొనెయ్యండి. మీ అమ్మగారికి కావలిస్తే ఏదైనా స్టీలు వస్తువు కొనండి సరిపోతుంది" చక్రవర్తి సలహా. క్రిష్ణవేణి ఉత్సాహం చప్పగా చల్లారిపోయింది. అయినా పైకేమీ ప్రకటించకుండా తల తాటించింది.

"పోనీ ఓ పని చెయ్యండి మీరు. నాకు తెలిసిన వాళ్ళ గిఫ్టు షాపొకటుంది అక్కడ చాల వెరైటీ ఉంది. జనరల్ ఐటమ్స్ ఏమయినా మీకు నచ్చినవి దొరుకుతాయేమో

# భ్రమర పంచకం

చూడండి. లేకపోతే బట్టల షాపు లెలానూ ఉన్నాయి'' ఇది బాపూజీ రీజనింగ్.

''ఎక్కడుందండీ ఆ షాపు? కాస సరయిన డైరెక్షన్స్ ఇచ్చారంటే వెళ్ళి చూసొస్తాను'' కృష్ణవేణి ముఖం కాస వెలుగును పుంజుకుంది.

''రాజా బ్రదర్స్ ప్రక్క సందులోంచి పెద్ద మెయిన్ రోడ్డుకి కనెక్టింగ్ రోడ్ చివరుంది. మరీ పెద్ద షాపు కాదుగానీ చాలా మంచి వస్తువు లుంచుతాడు. గిఫ్ట్ ఎంపోరియం'' అని బాపూజీ వివరించాడు. ''ఒక వేళ మీకు తెలీక పోతే నా స్కూటర్ మీద తీసుకెడతాను రండి— మీ కభ్యంతరం లేక పోతే'' ఇన్విటేషన్ అందించాడు.

ఈ సలహా, సహాయం కృష్ణవేణికి వచ్చింది. ఇతనితో వెళ్ళొచ్చేస్తే ఆలస్యం కాకుండా ఇల్లు చేరవచ్చు. ఆ మాటే పైకనేసింది.

''చాలా థాంక్సండీ మీ సహాయానికి'' అని కృతజ్ఞత వెల్లడించింది.

సాగర్ చక్రవర్తుల మనసులు మాడుతున్నా ముఖాలు ప్రసన్నంగానే ఉంచుకున్నారు.

''సాయంత్రం ఇటునుంచే వెడదామా'' అని బాపూజీ అడిగితే,

''అదేనయం కదండీ'' అని సమాధానమిచ్చింది క్రిష్ణవేణి.

టిఫిన్ బాక్స్ ఖాళీ అయినా, జీతం వల్ల పర్సు బరువుగా ఉన్నట్టు తోచింది క్రిష్ణవేణికి. ఐదవగానే బాత్రూం లోని కెళ్ళి జడ మరోసారి చిన్నదువ్వెన్నతో దువ్వివేసుకుని, కాంపాక్టు తీసి ముఖం కాస్త తాజాగా తయారయిందనిపించి పెన్సిల్ తో బొట్టును మళ్ళీ డార్క్ గా చేసుకుంది. ఇవన్నీ ఎప్పుడూ తన పర్సులో ఉండవలసిందే నంటుంది. అందుకే అందరిలా చిన్న పర్సు చాలదు క్రిష్ణవేణికి. ''పెద్ద బకేళా'' అని తల్లీ, రవీ అప్పుడప్పుడు ఉడికిస్తూంటారు కూడాను. అయినా పట్టించుకోదు.

మెట్లుదిగి క్రిందికి వచ్చేసరికి బాపూజీ స్కూటరుతో వెయిట్ చేస్తున్నాడు.



మద్రాసులో అధికారాన్ని స్వీకరించిన అమెరికా దౌత్యోన్నతాధికారి శ్రీ డగ్లస్ యస్. క్రాకాన్

క్రిష్ణను చూడగానే స్టార్టుచేసి, గేరువేసి రెడీగా ఉంచాడు. క్రిష్ణ ఎక్కి సర్దుకుని కూర్చునేవరకూ ఆగి ఆపైన''వెడదామా'' అని అడిగి మరీ స్కూటరును పోనిచ్చాడు. విదానంగా విశ్వలంగా నడుపుతున్న అతని నేర్పుకు మనసులోనే అభినందించింది.

ఇదే రవి అయితే, పట్టు క్కూర్చుంటే తప్ప క్రింద పడుతుందనే భయం క్రిష్ణవేణికి, అందుకే తనెపుడూ నాన్నగారితో కార్లో వెళ్ళటమే నయమనుకుంటుంది. హాయిగా ఆలోచనలలోపడి, రెండు చేతులూ వదిలి కూర్చున్న క్రిష్ణవేణి షాపు రావటం, దాని ముందర జెర్క్ తో స్కూట రాగటం గమనించక పొరపాటున చటుక్కుమని బాపూజీ భుజం పై చెయ్యి వేసింది. వెంటనే 'అయాం సారీ' అని స్కూటరు దిగి దూరంగా నిలబడింది.

భుజం మీద పడ్డ ఆమె సున్నితమైన వ్రేళ్ళ స్పర్శకు బాపూజీ గుండె ఝల్లు మంది. ఎంత సుతారంగా పట్టుకుంది. తన భార్య స్కూటరు మీద ఇటు పోండిలు అటూ కారేజీ పట్టుకుని, అడ్డంగా కూర్చుంటుంది. ఎన్నిసార్లు చెప్పినా! ఈమె ఎంత మృదువుగా ముట్టుకుంది?

"పదండి" అంటూ షాపులోకి దారి తీశాడు. క్రిష్ణవేణి తన తండ్రికి ఖరీదయిన పార్కరు పెన్ను, తల్లికి దంతపు దువ్వెన సెట్టు, అన్నకు స్కూటరు నడిపేటప్పుడు తలమీద పెట్టుకునే హెల్మెట్ కొంది ఆమె పరేజ్ చాలా బాగుందని బాపూజీ తెగ పొగిడాడు మరేవో వస్తువులు చూస్తూంటే అతడు తన చేతికి చేయి తగిలించినట్టనుమానం. క్షణ క్షణానికీ ఉల్లాసవంతమూ ఉద్రిక్తమూ అవుతున్న అతని వైఖరికి క్రిష్ణవేణి కళవళ పడింది. తను స్కూటరు మీద సరిగా కూర్చోక పోవడం, ఆలోచనల్లోకి జారిపోవటం పొరపాటయింది. అతనితో ఒంటరిగా రాకుండా ఉండవలసింది. ఇదేమంత మంచి పనిలాగా అనిపించటం లేదు. నిట్టూర్చింది కృష్ణవేణి.

"క్యాంటీన్లో ఏమయినా తీసుకుందాం పదండి" అని బాపూజీ అంటే, మరియాదగా ఉండదని తెలిసీ, సుభావంగా,

"వద్దు! ఇప్పటికే ఆలశ్యమయింది. నన్ను మా యింటి దగ్గర విడిచి పెట్టేయండి" అని అంది క్రిష్ణవేణి. తిరుగు ప్రయాణంలో స్కూటరు స్పీడు రవ్వంత పెరిగినట్టు గ్రహించింది.

ఇదేమిటి? క్రిష్ణవేణి కూడా తన భార్యలాగే కూర్చుం దిమాటు? ఆశ్చర్యపోవటం ఈసారి బాపూజీ వంతయింది. ఇంటి దగ్గర దిగబెట్టి లోనికి రమ్మంటే 'నమస్కారం'టూ వెళ్ళి పోయాడు బాపూజీ.

కామేశ్వరమ్మకూ, శర్మగారికీ, రవికీ ఆమె తెచ్చిన బహుమతులు నచ్చాయి.

"రవికి సరిగ్గా తగిన బహుమతి తెచ్చావు కృష్ణా. వాడి స్పీడు చూస్తుంటే నాకెప్పుడూ భయమేను." అని కామేశ్వరమ్మ మెచ్చుకుంది.

"హౌ వెరీ థాట్ ఫుల్ ఆఫ్ యూ మై ఛైల్డ్" అని శర్మగారూ అన్నారు.

"యూ సిల్లీ గాల్! నేనంత ఈజీగా యాక్సిడెంట్స్ చేస్తాననుకున్నావా? నీ కదేదో థ్రిల్లింగ్గా ఉంటుందని నేననుకుంటున్నాను క్రిష్ణా! ఓహ్ డియర్! నీ కింత భయమని నాకు తెలియలేదు. ఇందుకే నన్నమాట తమరీవేళ ఆ నేతగాడితో కలిసి మార్కెట్ అంతా వెతికేసింది" అని రవి ఆట పట్టించాడు.

మరుకుగా రవికేదో జవాబీయబోయిన క్రిష్ణవేణి శర్మగారి ప్రశ్న విని నిరుత్తరమైంది.

"వివరమ్మాయా అతను" శర్మగారి గొంతు గంభీరంగా పలికింది.

"మా ఆఫీసులోనే నా ప్రక్కసీటే డాడీ! అతనికి తెలిసిన గిఫ్ట్ షాపుకు తీసుకు వెళ్లాడు. అక్కడే ఈ ప్రెజెంట్సు కొన్నాను." అని వివరించింది. తను అనుకోకుండా అన్న మాట వల్ల చెల్లెలు నొచ్చుకుందేమోనని రవి ఆమె వంక కంగారుగా చూచాడు. కానీ చెల్లెలి ముఖంలోని ప్రశాంతత చూసి సంతృప్తి చెందాడు.

శర్మగారూ తృప్తి చెందారు. అంత మాత్రానికే కూతుర్ని అనుమానించేంత సంకుచిత స్వభావులు కారు వారు. అయినా ఆడపిల్లను కన్న బాధ్యత గల తల్లితండ్రులుగా వారా మాటా అడుగక తప్పదు. కానీ క్రిష్ణవేణి జవాబుతో వారి అనుమానాలన్నీ పటాపంచలయినాయి. "నా కూతురు తెలివితక్కువ పిల్లకాదు. షి ఈజ్ మై డాటర్" అని ఆయన మనసులో అనుకున్నారు. మొత్తానికి ఆ రాత్రి సరదాగా గడిచిపోయింది

ఆ రోజు ఆఫీసులోకి చాలా వికసిత వదనంతో వచ్చాడు సాగర్. అంతకు కొంచెం ముందుగా వచ్చిన క్రిష్ణవేణి బాగ్ డెస్కుక్రింద పెడుతూ సాగర్ను గమనించింది.

"ఏమిటీ! ఇవాళ చాలా సంతోషంగా కనిపిస్తున్నారు? ఏదో విశేషం ఉండి ఉండాలి" క్రిష్ణవేణి అంది.

"విశేషమేనండి. మా చెల్లికి పెళ్ళి కుదిరిందండి. ఎన్నాళ్ళబట్టినుంచో చూస్తున్నాం సంబంధాలు ఈ పెళ్ళివారు మా చెల్లెల్ని క్రిందటి నెల చూసి వెళ్ళారు. వచ్చిందనీ, జాతకాలు కుదిరితే ముహూర్తాలు పెట్టించమని వ్రాశారు. అతను ఒక ప్రైవేటు కంపెనీలో పర్సనల్ ఆఫీసరు. మంచి జీతం. చక్రవర్తికి చూపిద్దామని జాతకాలు తెచ్చాను కుదిరితే అంతా సెటిల్ అయినట్టే." ధారాపాతంగా చెప్పుకు పోయాడు.

"చాలా సంతోషం. మీ చెల్లెలు ఏం చేస్తున్నారు?" క్రిష్ణవేణి ప్రశ్నించింది.

"అది బియ్యేస్సీ చదివింది పాటకూడా చెప్పించాము. కట్నముక్కరలేదుట. కానీ ఆడపడుచులకూ, అత్తగారికీ ఘనంగా లాంఛనాలు కావాలిట ఈ రోజుల లెక్క ప్రకారం నయమేనన కోండి" ఇంకా ఏదో అనబోతున్న సాగర్ వాక్ప్రవాహానికి క్రిష్ణవేణి ప్రశ్న ఆనకట్ట వేసింది.

"మీ రెంత పుచ్చుకున్నారు?" అని అడిగిన ఆమె ముఖంలో కొంటెతనం స్పష్టంగా కనిపిస్తోంది. కనుముక్కు తీరు గలిగి, చామన చాయగా పొడుగ్గా ఉండే సాగర్ ముఖం చిన్న బోయింది.

"మీ అంత అందమయిన దయితే నా భార్య, నా మామగారి దగ్గర రపలు కట్నమే పుచ్చుకోక పోదును." ఉడుక్కుంటు న్నట్టున్నాడు సాగర్. అతడు తన అందం గురించి చేసిన ప్రశంస అధిక ప్రసంగ మనిపించిందామెకు.

(ఇంకా వుంది)



# అవీ...ఇవీ...అన్నీ

ఇటీవల కళాభారతి ఆధ్వర్యంలో మద్రాసు రాణి సీతాహాలులో శ్రీ బులుసు వేంకటరమణయ్య గారి సన్మాన సభ అత్యంత వైభవోపేతంగా జరిగింది. శ్రీ పి. బ్రహ్మయ్యగారు అధ్యక్షత వహించి, శ్రీ రమణయ్యగారిని పట్టువస్త్రాలతోనూ, సన్మాన పత్రంతోనూ సత్కరించారు. వేంకట రమణయ్యగారి పాండిత్యాన్ని గురించి శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారు ప్రసంగించారు. శ్రీ సి. వి. శ్రీనివాస్ ప్రార్థనతో ప్రారంభమైన ఈసభలో శ్రీ వేంకటరమణయ్యగార్ని కళాభారతి ఉపాధ్యక్షులు శ్రీ డి. వి. కృష్ణారావుగారు సువర్ణాంగుళీయకముతోనూ, శ్రీ ఆర్. ఆర్. నాదం గారు రజితమయ శ్రీ రామపట్టాభిషేక పటముతోనూ, శ్రీ పి. బి. సుబ్బారావుగారు, శ్రీ పి. వి. రమణయ్య(రాజా)గారు దుశ్శాలువలతోనూ సత్కరించారు. ప్రొ. చిన్నికృష్ణయ్య డా. చిల్లా రాధాకృష్ణ శర్మ ప్రభృతులు పండిత ప్రముఖులు హాజరయిన ఈ సభలో తనకు జరిగిన ఈ సన్మానానికి కృతజ్ఞత తెలుపుతూ, శ్రీ వేంకటరమణయ్యగారు నా రకంగా అజ్ఞాతవాసం గడుపుతున్న ఒకణ్ణి సన్మానించడం ఇంతకుముందెన్నడూ? సన్మానితుల క్రమం చూచినపుడు కళాభారతి యొక్క సాహిత్యాభిలాష, కళాభారతి ఔన్నత్యం తెలుపుతున్నాయని, మద్రాసునగరంలో భారీ ఎత్తున సాంస్కృతి కార్యక్రమాలు నడపడంలో నిరంతరావాటికి మార్గదర్శకమవుతున్న కళాభారతి సంస్థకూ, తనకూ గత ఏభయిదేళ్ళనుంచి అనుబంధం ఉన్నదని ఈ సంస్థ కలకాలం సాహితీసేవ చేస్తుండాలని అన్నారు. కె. ఎస్. ఆర్. నరసింహస్వామి వందన సమర్పణతో సన్మానసభ ముగిసింది. అనంతరం శ్రీ ఏనాకుల సత్యనారాయణగారి కచేరి జరిగింది.



"ధర్మపథం" శ్రీ బులుసు వేంకటరమణయ్యగారిని మద్రాసులో సత్కరిస్తున్న దృశ్యం





ఇటీవల బొంబాయిలోని నటరాజ ఆర్ట్స్ అకాడమీలో అరంగేట్రం చేసుకొని తన నృత్య కౌశల్యంతో కుమారి కిరణ్మయి పెద్దల ప్రశంస అందుకుంది.


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna



'మహా శక్తి'లో జయమాలిని, నరసింహరాజు


SALOFEN
SALOFEN